# బుద్ధహృదయము

శ్రీ పి. వి. రమణారెడ్డి ఎం. ఎ.



మారుతీ బుక్ డిపో.
గుంటూరు – 1

శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి ఆశీరభ్యర్థనముతో
సమర్పించబడినది - పి.వి. రమణారెడ్డి
24-3-59

# బుద్ధహృదయము



అనువాదకులు:

సాహిత్యరత్న, విద్యాప్రవీణ,

**శ్రీ పి. వి. రమణారెడ్డి** ఎం. ఏ.

హిందీ ఉపన్యాసకులు:

యస్. యస్. అండ్ యన్. కళాశాల,

నరసరావుపేట.

మారుతీ బుక్ డిపో.

గుంటూరు - 1

వెల: 1—00



# జాతీయ గీతము

జనగణ మన అధినాయక జయహే !
భారత భాగ్య విధాతా !
పంజాబ్, సింధు, గుజరాత్, మరాఠా,
ద్రావిడ, ఉత్కళ, వంగ,
వింధ్య హిమాచల యమునా గంగా,

ఉఛలత్ జలధి తరంగా,
తవ శుభనామే జాగే
తవ శుభ ఆశి సమాగే
గాహే తవ జయగాథా !

జనగణ మంగళదాయక జయహే !
భారత భాగ్య విధాతా
జయహే ! జయహే ! జయహే !
జయ జయ జయ జయహే !

# తొలిపలుకు.

"బుద్ధహృదయము" అను నీ గ్రంథము సత్యసమాజ సంస్థాపకుడగు సత్యభక్తస్వామిచే హిందీ భాషయందు రచింపబడినది. ఈ రచన బుద్ధభగవానుడు స్వయముగా తన అనుభవములను డైరీలో వ్రాసికొనిన ప్రణాళికలో సంతరింపబడినది. శ్రీ పి. వి. రమణారెడ్డి ఎం. ఏ. గారు దీనిని ఆంధ్రీకరించిరి.

మన కన్నులయెదుట జీవించి మిక్కిలి ప్రభావవంతముగా సత్యాహింసల సాధనమున నిద్రాణమైన భారతజాతిని మేల్కొలిపి సత్యాగ్రహ మార్గమున స్వరాజ్యమును సాధించిన గాంధీమహాత్ముని మహత్వమును చింతించినంతనే మనోలోకమున బుద్ధభగవానుని చరిత్ర ప్రతిఫలించును. మహాత్ముడు తన స్వీయచరిత్రను రచించిన ప్రణాళిక మన మనస్సుపై దృఢముద్ర వైచును. సత్యసాధనకు జీవితమును నడుపు సత్యభక్తస్వామి ఈ ప్రభావమునకు లోనై ఈ గ్రంథమును నిర్మించి యుండును.

గాంధీమహాత్మునకును. బుద్ధభగవానునకును మిక్కిలి సామ్యము గోచరించును. ఉభయులును నిద్రాణమైన భారతజాతిని ధర్మమార్గమున నడిపించుటకు సర్వస్వమును త్యాగము చేసిరి. ఉభయులకును సత్యాహింసలు ప్రధాన సాధనములు. ఉభయులును ప్రమాణగ్రంథ విశ్వాసముచేగాక స్వానుభవముచే తత్త్వమును దర్శించిరి. ఉభయుల మతములును విశ్వజనీనములు. ఉభయుల అవతారములును లోకకల్యాణ దాయకములు.

మహోద్యమముల నడుపుటలో ప్రవక్తల కష్టసుఖము లనుభవపూర్వకముగా నిందు వర్ణింపబడినవి. బౌద్ధమతమునకు సంబంధించిన అనేక సన్నివేశములు కాల్పనికములుగాక పరిశోధకులచే స్వీకరింపబడినవే. ఈ గ్రంథమున సంగ్రహింపబడినవి. మహాత్ముల అడుగుజాడల నడచుచు ఉద్యమముల సాగించువారు తక్క ఇతరు లింత మనోహరముగా నీ విషయములను సంగ్రహింప జాలరు. మధురమగు భాషలో ఆంధ్రీకరింపబడిన ఈ గ్రంథము ఆంధ్రబాలురకు పఠనీయమని నా విశ్వాసము.

నరసరావుపేట,
2-6-1957.

తూములూరు శివరామకృష్ణమూర్తిశాస్త్రి.

# రెండు మాటలు.

బుద్ధ మహాత్ముడు 'మహాపరినిర్వాణము'ను పొంది యిప్పటికి రెండువేల ఐదువందల సంవత్సరములైనమాట నిజమైనను వారు నేటికిని లోకమున జీవించి యున్నారు. మానవ సమాజమున్నంతవరకు వారు జీవించియుందురు. తమ జీవితమువలన మానవ సమాజమును జీవింపచేయుదురను మాటయు సత్యమని చెప్పుటలో నావంతయు సందేహములేదు.

ఇది యొక చిన్న గ్రంథము. బుద్ధమహాత్ముని పూర్ణ జీవిత చరిత్రగాని లేక బౌద్ధధర్మమునకు సంబంధించిన పూర్ణ పరిచయముగాని యిందులేదు. ఇది యొక జీవనయాత్రికుని యాత్రానుభవములయొక్క లఘుసంగ్రహము మాత్రమే. ఒక రాజకుమారుడు బుద్ధత్వ శిఖరము నధిరోహించి తన యనుభవములను దిన చర్యాపుస్తకమున వ్రాయుచు పోవుచుండునట్టిపద్ధతిలో ఈగ్రంథము వ్రాయబడినది.

నేడు ప్రపంచమున ఈశ్వరునివలె పూజింపబడువారుగూడ తమజీవితమున సాధారణ ప్రజలవలె అనేక కష్టములను అనుభవింపవలసివచ్చినది. వారి పురోభివృద్ధియు క్రమక్రమముగనే జరిగినది. వారిసంస్థలును మెల్లమెల్లగనే పుష్పించి ఫలించగలిగినవి. వారును విరోధము, నింద, ఉపేక్ష మొదలైన విఘ్నములను ధైర్యముతో నెదుర్కొనియే ముందుకునడువగలిగిరి. పరిచితులు, అనుయాయులు, భక్తులు, శిష్యులు మొదలైన వారి స్వార్థములతో, వారి అజ్ఞానముతో సంఘర్షణయు వారికి తప్పలేదు. ఈఘట్టములను దాటిన మీదటనే వారికి సఫలత్వము లభించినది. ఈసఫలత్వమునకు ఈక్రింది గుణములు కావలయును—— అనంత ధైర్యము, అసీమసాహసము, పూర్ణ వివేకము, దీర్ఘాలోచన, పూర్ణత్యాగము, అగాధానుభవము, అలసిపోని ప్రయత్నము, నిరంతర సావధానత, చతుర్ముఖ దృష్టి, అచంచలశ్రద్ధ, ఆత్మ విశ్వాసము, విశ్వహితాభిలాష, నిరపేక్షత, సమ భావము మొదలగునవి. బుద్ధ మహాత్ముడు ఇట్టి సద్గుణ సంపత్తిగలవారిలో నొక రగుటయేగాక వీరిపంక్తిలో నగ్రస్థానమున కర్హుడు. ఈపుస్తకమందు వర్ణింపబడిన జీవిత సన్నివేశములు బౌద్ధసాహిత్యమునుండి యథాతథముగనే గ్రహించబడినవి. అనగ కల్పితములుగావని భావము. ఆసన్నివేశములనుబట్టి బుద్ధునియొక్క మానసిక చిత్రణ చేయబడినది. బుద్ధుడు మానవుడని భావించి వారి మనోభావములు వర్ణింపబడినప్పటికి బుద్ధునివ్యక్తిత్వమున కనుగుణముగ ముందు, వెనుక వర్ణింపబడిన జీవిత సన్నివేశములలో సామంజస్యముండుటకు తగు ప్రయత్నము చేయబడినది. ఇంతేగాక కొన్నిసన్నివేశములలో ఔచిత్యమును పెంపొందించుటకు యత్నము చేయబడినది. 'భిక్షుణీ సంఘ స్థాపనము', యువకసాధువుల యావశ్యకత మొదలైన ప్రకరణములందు ఈవిషయము సుస్పష్టముగ నిరూపింపబడినది.

బుద్ధ మహాత్ముని మనోభావముల నింతచక్కగ వర్ణించుట సాధారణ వ్యక్తి వలన జరుగుపనికాదు. ఎవ్వరు ప్రయత్నించినను ఈపుస్తకమున నున్నంత సుందరముగ, నైసర్గికముగ చిత్రించలేరు. క్రాంతిదాయకము, నవీనమునగు సంస్థయొక్క భారము ఎవ్వరి స్కంధములందుండునో, అడుగడుగున విపత్తి, విరోధము, ఉపేక్షానిందలను ఎవ్వరెదుర్కొనుచున్నారో, పుస్తకములనేగాక మానవ హృదయముల నెవరు గంభీరముగా జదువగలిగిరో, జీవితమునకు నలు వైపుల కష్టములు, సంకటములు, అసౌకర్యములు చుట్టుకొన్నప్పుడు ఎవరు ఒక క్షణముగూడ నిరాశను చెందలేదో వారే బుద్ధ మహాత్ముని మనోభావములు చక్కగ తెలిసికొనగలరు. వారే వివరముగ దానిని వర్ణించగలరు. అటువంటి ఒక మహా జీవితమే శ్రీ సత్యభక్తగారి జీవితము. సత్య సమాజమును స్థాపించిన వారగుటచే దానిభారము వారి భుజములమీద నున్నది. ప్రారంభమునుండి పరిచితమైన, అపరిచితమైన క్షేత్రములందు కలిగిన విరోధములను అసీమ ధైర్య సాహసములతో వీరు ఎదుర్కొనుటయేగాక ముందడుగు వేయుచు పురోభివృద్ధిని గాంచుచున్నారు. తమ సర్వస్వమును ఈ సత్కార్యములకే సమర్పించిరి. సత్య సమాజ ప్రచారమే వారి జీవిత పరమావధిగ మారినది. సత్యసమాజ సిద్ధాంతములను ప్రచారము చేయుచు తద్ద్వారమున మానవ కల్యాణమును కల్గించుటయే వారికిగల యేకైక ధ్యేయము. వీరి అనుభవములు అగాధములు. వీరి ఆలోచనా శక్తి ఉన్నతశ్రేణికి చెందినది. సర్వధర్మ సమభావము, సర్వజాతి సమభావము, సాంఘిక క్రాంతి- ఇవి వీరి ఆదర్శ సిద్ధాంతములు. వీరి జీవితము అత్యంత పవిత్రమై, ఉన్నతశ్రేణికి చెందినదై, మహాదర్శ సమన్వితమై, సర్వమానవుల కనుకరణీయమై ఉన్నది.

శ్రీ సత్యభక్తగారు ఈ గ్రంథముద్వారా బుద్ధమహాత్ముని మహత్వము నిరూపించిరి. కాని దీనివలన వీరి జీవితమహత్వముగూడ మనకు తెలియుచున్నది. ఈ పుస్తకము చదువుటకేగాక మననము చేయదగినదికూడ. పాఠకులు ఈ గ్రంథముద్వారా సంపూర్ణ లాభము పొందగలరని ఆశించుచున్నాను.

ఇట్లు,
ప్రకాశకులు (హిందీ).
రఘువీర చరణ్ దివాకర్,
బి. ఏ., యల్‌యల్. బి.
'నయాదునియా' సంపాదకులు.
వార్ధా.

శ్రీ. బుద్ధమహాత్ముని సన్నిధికి,

మహాత్మా ! తమకు, నాకు మధ్య 2500 సంవత్సరముల దూరమున్నది. అయినప్పటికి తమ దినచర్యలోగల పుటలను చదువగలిగితిని. తమ చరిత్ర తమకే సంబంధించినదిగాక ప్రపంచమునగల మహామానవులకు సంబంధించిన అమరచరిత్ర యగుటయు, ఆ చరిత్రకు ముదిమి, దూరములు రెండును లేక పోవుటయు దీనికి కారణమని యూహింతును. ప్రజోపయోగార్థము సర్వస్వమును త్యజించి అన్యకల్పనలనుండి మానవుని దూరముగ నుంచి, అతనికి కల్యాణమార్గము చూపించు మహామానవులు మీరు. కాని ద్వేషముచే కొందఱు తమను తిరస్కరించిరి. మరికొందఱు అజ్ఞానము వలన తమను మఱచిరి. మోహమువలన మరికొందఱు తమను కానుకలతో నింపివేసిరి. కాని తమను మహామానవులని తెలిసికొనగలిగినవారు వెదకినను దొఱకుటలేదు. తమను ప్రజలు యథార్థముగా నర్థముచేసికొనవలయునని, నరత్వమునుండి నారాయణత్వమును పొందు కళను నేర్చుకొందురుగాక యని తమ దినచర్యాపత్రములను ప్రపంచమున వెదజల్లుచున్నాను.

కాలప్రవాహమున నప్పుడప్పుడు తథ్యములు క్షతవిక్షతములై పోవుచుండును. కాని సత్యము కాలశక్తిని మించియుండును. కాలము సత్యమునకు పూజారి. సత్యమును నవీనాతినవీన పద్ధతులతో పూజించుచుండును. కాని భగ్నమొనరింప ప్రయత్నించదు.

ఈ పుటలలో తథ్య మచ్చటచ్చట క్షతవిక్షతమైనను, సత్యము మాత్ర మక్షుణ్ణముగా నున్నది. ఈ విషయము ప్రజలకు తెలిసినను, తెలియకున్నను తమకు తెలియును. అందువలన యీ పత్రములను తమ సన్నిధిలో సమర్పించుచున్నాను.

ఇట్లు,
తమ అనుచరుడైన బంధువు,
దర్బారిలాల్ సత్యభక్త.

I

# 1. నిజమైన సుఖాభిలాష.

నాకును దుఃఖమున్నదని నన్ను చూచినవా రెవరన గలరు? ఒకవైపు రాజభవనము. మరొకవైపు అందమైన అర్ధాంగి. ఆనందమూర్తియైన పుత్రుడును. అందరు ఆజ్ఞాకారులే. అయినప్పటికి నాకు సంతోషములేదు. నా జీవితమునకు ప్రయోజనమేమి? అని ఆలోచన కలుగు చున్నది. వందలకొలది పరిచారకులు కరములు మోడ్చు చున్నారు. కాని వీరు కరములు జోడించునది నాకా, నా వైభవమునకా? నేను రాజవంశమునందు జన్మించనప్పుడు- నాయొద్ద నీ గొప్ప సిరిసంపదలు లేనప్పుడు - వీరు నాకు నమస్కరించుదురా? వీరి హృదయములలో నాయందు భక్తి లేదు. వీరు వైభవములకు దాసులు. ఈ దాసులలో నేను గొప్పవాడను. గొప్పతనము బాహ్యమునకే.

నేను ఉద్యానవనమునకు వెళ్ళుచుంటిని. మధ్యలో ఒక సన్యాసిని చూచితిని. అతనియొద్ద ఏమియులేదు. భిక్ష వలన జీవితమును గడుపుచున్నాడు. అయినను నా సిరి సంపదలంటే లేశమైనను అతనికి లక్ష్యములేదు. నా దాస దాసీలకంటెను దరిద్రుడైనప్పటికి నన్నుచూచి తలవంచి నమస్కరించలేదు. నే నతనిని జూచినప్పుడు, "నీ కంటె నేనే గొప్పవాడ"నను భావమును స్ఫురింపజేయు చిరునగవుతో వెళ్ళిపోయెను. నే డందరు నాకు శిరస్సులు వంచి నమస్క-

రించుచున్నారు. రేపు నా యౌవన ముడిగిపోయి, వైభవ మంతయు తగ్గిపోయినప్పుడు – లేక మరొకరాజు నా రాజ్యము నపహరించినప్పుడు – నా కెవ్వడు తలవంచును? కాని నా కిష్టములేకున్నను నన్నోడించిన రాజుకు నేనే తలవంచి నమస్కరించవలసియుండును. ఆ సన్న్యాసిమాత్రము ఏచక్రవర్తిని జూచినను లక్ష్యపెట్టడుగదా? తన యిష్టమునకు వ్యతిరేకముగా నత డెవ్వరికిగాని తలవంచడు. తన గురువునకుగాని, తన కంటె నధికుడైన యోగిపుంగవునకుగాని తాను భక్తిపూర్ణ హృదయుడై ప్రణమిల్లును. ఈ వినయము నతడు భక్తితో జూపును. భక్తికి ఇచ్ఛా స్వాతంత్ర్యములు ప్రధాన కారణములు. కాని, వైభవమునకు, శక్తికిని లొంగిపోవు వానిలో ఆ స్వాతంత్ర్య గౌరవము లెక్కడనున్నవి? ఈ విధముగ నాలోచించినప్పుడు రాజాధిరాజ పదవిలో నుండియు నేను మిక్కిలి క్షుద్రుడను. ఈ క్షుద్రత్వమును కప్పిపుచ్చుటకు గాను 'దాస దాసీలను' పేరుతో దిరుగునట్టి 'మట్టిబొమ్మల'ను నా చుట్టు పెట్టుకొన్నాను. ఈ రూపముగ ఆత్మను వంచించుకొనుచున్నాను. ఆత్మవంచకుడైన ప్రతి మానవుడు జగద్వంచకుడే యగును. ఇట్టి వంచనామయమైన జీవితము కూడ ఒక జీవితమా? ఈ బాధ నెవరు తెలిసికొనగలరు? గృహమును త్యజించి అరణ్యమునకు పలాయనమైనప్పుడు ప్రజలు నన్ను లోకోత్తర త్యాగి యనియో లేక ఉన్మత్తుడనియో పిలుతురు గాని, నా హృదయమునందు కలిగిన యీ వేదనా రహస్యము నెవ్వరును గుర్తించ జాలరు.

అక్కటా! ప్రజలందఱు నన్ను సిద్ధార్థుడని పిలుచుచుగాని నాకెట్టి అర్థములును సిద్ధించలేదే! చివరకు నేను అసిద్ధార్థుడ నైతిని.

## 2. నిష్క్రమణాభిలాష.

ప్రపంచమునగల ప్రాణుల కష్టములను చూచుచు ఆలోచించుకొలది, నాకు విశ్రాంతి దొరకుటలేదు. జరా రోగ మరణాది సహజకష్టములు మానవునికి ఉండనేయున్నవి. వానితోపాటు ప్రాణి మరొకప్రాణిని, మానవుడు మరొక మానవుని పలువిధముల హింసించి భక్షించుట సహింపరాని కష్టము. బలము, అధికారము, జాతి, కులము, ధర్మము – వీని పేళ్లతో అన్యాయములు, అత్యాచారములు చేయుచున్నారు. ఈ విధముగ కార్చిచ్చు నలుప్రక్కల భగ భగ మండుచుండగా, నే నొక వృక్షముపై నెక్కి కూర్చుండి, సురక్షితుడనని తమాషా చూచుట ఎట్లు సంభవము?

"ఓ సిద్ధార్థుడా! నీవు రాజువుకమ్ము. చక్రవర్తివి కమ్ము. నీ రాజ్యాధికారములతో, సిరిసంపదలతో ప్రజలకు సుఖములను చేకూర్చు"మని ఈ దుష్టమన్మథుడు నన్ను పురికొల్పుచున్నాడు. ఇదెంతటి మూర్ఖత్వము! అధికార వైభవములకొఱకు నేను ప్రజలకెంత దుఃఖమును కలుగజేయవలసి వచ్చునో, నేను తీర్చు దుఃఖమంతయుండదే. ఇక ప్రపంచ

ములోగల యితర దుఃఖములమాట చెప్పనేల? సమాజమున వ్యాపించిన ఆధివ్యాధులు (అసమానతలు, అసహనము, ఈర్ష్య, ద్వేషములు) మానవునికి స్వభావసిద్ధముగ వచ్చిన వ్యాధులు వైభవమువలన, అధికారమువలన దూరమగునా?

"ఓ సిద్ధార్థుడా! ఐశ్వర్యమునకు, నధికారమునకు కొదువలేని ఈ జీవితములోనే నీవు సఫలుడవు కానియెడల, నిక సర్వసంగ పరిత్యాగివై నీవెట్లు కృతార్థుడవు కాగలవు? అప్పుడు నీవలన ఎవరికేమి ప్రయోజనము కలుగును? నీ పొట్టనుగూడ నీవు నింపుకొనలేవు! ప్రపంచమున నిలబడక పరుగిడినచో, నిన్ను పిరికిపందగను, దీనునిగను ప్రజలు లెక్కింతురని" దుష్టమన్మథుడు నన్ను హతాశునిగా చేయుచున్నాడు.

కాని ఈకాముని శరాఘాతములను నేను సహింతును. ప్రపంచము నన్ను దీనుడన్నను, భీరువన్నను, నేను లక్ష్యపెట్టనని చెప్పుచున్నాను. నా మనోరాజ్యమునకు నేనే చక్రవర్తిని. ప్రజలకు పొట్టనింపుట నాపనికాదు. ఎవరి పొట్టను వారు నింపుకొనుచునే ఉన్నారు. పశువులు కూడ తమపొట్టను తాము నింపుకొనుచునేయున్నవి. నేను ప్రపంచములోని మనుష్యులలో మానవత్వమును తీసికొని రాగోరుచున్నాను. సత్యము నన్వేషించి ప్రపంచమున ఈదుదలచితిని. సత్యాన్వేషణమునకు ధనము, వైభవము, అధికారము నవసరములేదు.

ప్రపంచము నన్ను తెలిసికొనలేకపోయినదో — ఆశ్చర్యము లేదు. నేను లక్ష్యపెట్టతగినంత బుద్ధి ప్రపంచమునకు లేదు. ఇంతవఱకు ప్రపంచము ఎవ్వనినైన ఎప్పుడైన తెలిసికొన్నదా? జీవించియుండగా వారి శక్తిని తెలిసికొనలేదు. మరణానంతరము, వారిని మరచిపోవుటయో, లేక ఆకాశమునకెత్తి పూజించి దేవతనైన జేయుటయో జరిగినదిగాని మనుష్యుని మనుష్యునిగా ప్రపంచము గుర్తింపలేదు. మానవుని పశువుగానో, లేక దేవతగానో భావించినది. ప్రపంచము తన అలవాటునకు లొంగిపోయినది. అందుకు నేను చింతింపవలసిన పనిలేదు. నేను నాపనిజేయుదును. ప్రపంచము తన పని తాను చేసికొనును.

నా మాటలువిని పాపీయుడగు మన్మథుడు పరుగెత్తిపోవును. నేనుగూడ పరుగెత్తిపోయెను.

# 3. నిష్క్రమణము.

పాపాత్ముడైన కామునితో నేను నాకుకలిగిన యుద్ధము ఇంతవఱకెన్నడును కలుగలేదు. బహుశః ఇకముందు కలుగబోదు. రాహులుడు, యశోధర, తల్లిదండ్రులు మొదలగు వారి ప్రేమపాశములనుండి తప్పించుకొనుట మహాకష్టమని భయపడి దొంగతనముగా ప్రాసాదమును త్యజించితిని. గృహ

మును త్యజించునపుడు, ఉన్నతప్రాసాదమునుండి మహా సముద్రమున దుముకుచున్నట్లనిపించినది.

ఆహా! ప్రేమబంధముకూడ ఎంత బలవంతమైనది! అర్ధరాత్రి సమయమున గృహత్యాగము చేయునప్పుడుగూడ రాహులుని, యశోధరను ఒకసారి చూడవలెనని కోరిక కలిగినది. గడపమీద నిలువబడి నేనిద్దరిని చూచితిని. కుమారుని ముద్దు పెట్టుకొను తలంపు కలిగినది. కాని యశోధర మేల్కాంచునను భయముతో నట్లు చేయలేకపోతిని.

ఈ అవకాశమును పాపాత్ముడైన మన్మథుడు చక్కగా వినియోగించుకొనెను. "ఓ సిద్ధార్థుడా! ఏమిటి నీ పిచ్చిపోకడలు? అనురాగవతియగు ప్రియురాలియందుకూడ నీకు దయలేదా? ఆమె నీ అర్ధాంగి. అర్ధాంగమును త్యజించి వెళ్ళుటకు నీకేమి హక్కు గలదు?" అని మన్మథుడనెను. "నేను ప్రపంచమునకు పూర్ణాంగమును త్యజించుచుండగ, అర్ధాంగత్యాగము తప్పక జరిగిపోవు"నని నేను జవాబు చెప్పితిని.

"అట్లయితే నీ ధర్మపత్నినిగూడ వెంటతీసికొని వెళ్ళరాదా?"

"ఏ అంగమున కెచ్చట ఎటువంటి ఉపయోగమున్నదో దాని నదేవిధముగా నచ్చట ఉపయోగించుకొనవలయును. సాధనకు పురుషాంగము మాత్రమే ఉపయోగ

కారి. సిద్ధార్థుడు బుద్ధుడైన మీదట ఒకచోట నిలకడ చేసికొని సతీపుత్రులను తీసికొనిపోవుటకు రాగలడు. లేక, గృహిణి (నా పత్ని) గృహమునందే అధికారయోగకారిణిగనుండుచో ఇచ్చటనే ఉండెదను."

" ఏమీ! స్త్రీ సాధన చేయలేదా? సిద్ధార్థుడా! కేవలము పురుషులే సర్వకార్య సమర్థులనియా నీ మతము? స్త్రీ అబలయని తలంచెదవా? ఇదే నీ యభిప్రాయమగుచో నీవు జగత్తునకు సేవచేయజాలవు."

"ఓ పాపాత్ముడా! మారుడా! నేను నిన్ను గుర్తింపగలిగితిని. నన్ను మోసము చేయుటకు జ్ఞానులవలె ఉపదేశము నిచ్చుచున్నావే! సాధనమార్గమునుండి నన్ను పడద్రోయ దలంచితివా? నీ మాటలు నాకు బాగుగ నర్థమగుచున్నవి. నీవు స్త్రీలపక్షమున మాటలాడుచున్నావు. నేను విశ్వహిత మార్గము ననుసరించితి. విశ్వకల్యాణమునకై నేను రాహులుని, (తల్లిని) యశోధరను త్యజించుచున్నాను. స్త్రీకూడ సాధనచేయగలదు. యశోధరయు సాధనచేయును. ప్రస్తుతము స్త్రీలుచేయుచున్న మానవ నిర్మాణ కార్యముగూడ ఒక సాధనయే. ఆమెచే నదిచేయించుటయే నా అభిమతము. నడచుట కుపక్రమించునప్పుడు, ఒక పాదము ముందుకు వేసెదము. రెండవపాదము గట్టిగ భూమిమీద నుండును. పాదద్వయము నొక్కసారి ముందుకు వేయలేము. అదే విధముగ నేను ముందుకు వెళ్లుచున్నాను. ఒకపాదము ముందుకు వెళ్ళి భూమిమీద ఆనినంతవఱకు రెండవపాదము వెనుకనే

స్థిరముగ నుందును."

"అయినప్పటికి ఓ సిద్ధార్థుడా! లోక కల్యాణ మొనర్చుటకు కావలసిన సాధన సామగ్రి గృహమునందెంత సమృద్ధముగా లభించునో అంత వనమున లభించదు."

"ఓ పాపీ మన్మథుడా! గృహమున నున్న కొందరికు మాత్రమే నేను కొంచెము సేవచేయగలుగుదును. గృహమును త్యజించినచో సమస్త విశ్వమునకు సేవచేయ గలను."

దుష్టుడగు మన్మథుడు హతాశుడై పారిపోయెను. కాని పారిపోయిగూడ వాడు నన్నెంతగనో బాధించుచున్నాడు. ఆ బాధను మరువజాలను.

శ్రేయోమార్గమునగూడ అనేక విఘ్నములు కలుగు చున్నవి. శత్రువులకంటె మిత్రులే మిక్కిలి బాధించు చున్నారు.

కంథకము (సిద్ధార్థుని ప్రధానాశ్వము) నెక్కి, రాత్రి యంతయు ప్రయాణముచేసి 'అనోమాన' నదీతీరమును చేరి తిని. ఒకేరాత్రి మూడురాజ్యముల సరిహద్దులను దాటి వచ్చినందున, కంథకము అసువుల వదలినది. అప్పుడు చెన్నుడు ఖేదఖిన్నుడై కన్నీరుగార్చ మొదలిడెను. నేను సన్యసించ బోవుచున్నానని పెద్దపెద్దగా నేడ్వ నారంభించెను. తాను గూడ సన్యాసదీక్షకై తలపడెను. దారులు లేక, దిక్కులు

సైతము కనుగొనరాని భయంకర కీకారణ్యమున నేను ప్రవేశించు విషయ మతని కేమి తెలియును. నా శిరోరుహములను తీయుటకుగూడ అష్టపడెను. కత్తి లేదని తెలిపెను. నేనప్పుడు కరవాలముతో నే శిరోరుహఖండనము చేసికొంటిని. చిన్నబిడ్డయొక్క మృతకళేబరమునుగాంచి తల్లి విలపించునట్లుగ చెన్నుడు భూమిమీదబడిన నాశిరోరుహములజూచి ఎంతగనో ఏడ్చెను. అతని మొగమునుచూడ నాకు చాల దయ గలిగినది. ఈ పాపాత్ముడైన కాముడు నాకు కొంత శోకమును కలిగించెను. కాని నే నతిప్రయత్నముచేత నా కన్నీటిని ఆపుకొన గలిగితిని. కాముడు పరుగెత్తిపోయెను." చెన్నుని వెనుకకు పంపించితిని.

నిన్నటివరకు నేను రాజకుమారుడను. నేడు అనిశ్చిత మార్గమునసున్న భిక్షుకుడను. నిన్న నేను మట్టిలో కలుపుకొంటిని. ఇక ఎప్పుడు అంకురము మొలకెత్తునో చూడవలయును.

## 4. ఉపేక్షావిజయము.

ఇప్పటికింకను మానవుడు పశువుగానే యున్నాడు. వాడు పశుబలమునకు తలవంచును. త్యాగము, తపస్సు, సేవలయొక్క మూల్యము నతడెఱుగడు. నేడు కరవాలము చేబూని యుద్ధమున ననేక వీరులను చంపి స్త్రీలను అనాథలు

గను, పుత్రులను పితృహీనులుగను, ముసలి తల్లిదండ్రులను పుత్రహీనులనుగాను చేయుచో ఆ యనాథలయిన స్త్రీలు, పుత్రులు, తల్లిదండ్రులే నావద్దకువచ్చి చేతులు జోడించి, నన్ను "అన్నదాత" "రక్షకుడు" అని కీర్తించి, స్వర్ణరజితములను, వజ్రమాణిక్యములను నాకు సమర్పించి నమస్కరింతురుగదా? నేడు — సమస్త రాజ వైభవములను త్యజించి, ఎవరికి ఏ మాత్రము బాధ కలిగించకుండ సేవకుడనై ప్రజల యెదుటకు రాగా వారు నాకు సమర్పించిన భోజన మేమిటి? ఈఅన్నమును నాయింటిలో పశువులుగూడ తినవే. కండ్లతో చూచిన పొట్టలోని పేగులుగూడ తరుగుకొని వచ్చుచున్నవే.

"ఓ మూర్ఖుడా! ప్రపంచము నిన్నుగాని, నీత్యాగమునుగాని లక్ష్యపెట్టదు. వందలకొలది భిక్షుకులలో నీవు నొక భిక్షుకుడవనియే వారిదృష్టి. నీ వీ విధముగా వారికే మియు చేయలేవు. కుక్క కాటుకు చెప్పుదెబ్బ మందు. నీవు మహారాజువై వచ్చినచో, నీకు బ్రహ్మాండమైన స్వాగతమిచ్చి, నీ మాటల నెంతో శ్రద్ధగా విందురు. నీయింటిలో నీ వెట్లు మూడు సంవత్సరముల ప్రాతవి, సుగంధితములైన బియ్యము వండించి అన్నమును భుజించుచుంటివో, అనేకములైన పానీయములను త్రాగుచుంటివో, అవన్నియు నీకిచ్చుట నయూచితముగ లభించెడివి. నీవు సమస్తమును త్యజించి, రాజులకంటె గొప్పవాడవయితివని తలంచుచుంటివి గాబోలు. కాని ప్రజలు నిన్నొక భిక్షుకుడని మాత్రమే తలచుచున్నారు. కాన మూర్ఖుడా! హితకాంక్షివగుచో, ఇప్పుడైనను తిరిగి

పోమ్ము." నా మనస్సులో దాగిన మన్మథుడు సమయా సమయములనుబట్టి సన్నివిధముగ నియత్నాపహాపరచెను. కాని నామీద విజయమును సాధించలేకపోయెను. కాముని ఈ వ్యంగ్య బాణములకు నేనీవిధముగ జవాబు చెప్పితిని.

"ఓ మూర్ఖుడా! త్యాగమహత్వము నీకేమి ఎఱుక? ప్రపంచము పశు బలమునకు, వైభవమునకు, అధికారమునకు దాసోహమనును. త్యాగమును, సేవాభావమును ఆదరించదు. నిజమే! ఇది ప్రపంచమునకు కలిగినజబ్బు. ఈజబ్బునే నేను దూరముచేయ తలంచుచున్నాను. రోగియొక్క రోగమును చూచి కలవరము చెందిన వైద్యుడు రోగి కేమి చికిత్స చేయగలడు? సన్నిపాత జ్వరములో రోగి వైద్యుని దుర్భాషలాడును. కాలితో తన్నునుగూడ. కాని వైద్యుడు వీటిని లెక్క చేయక, రోగికి తగు చికిత్స చేయును. అటులనే, ప్రజలు మూర్ఖత్వముచే నన్నవమానించినను, నన్ను పేక్షించినను నేను లక్ష్యపెట్టను. కాని వారి మూర్ఖత్వమును తొలగించుటకు నేను ప్రయత్నింతును. రాజుగనుండి నేను సన్మానమును పొందగలను. కాని అనంత యశస్సును మాత్రము పొందలేను. ఆయశస్సు హృదయ సంభవము; ప్రపంచమును లక్ష్యముచేయనిది."

నా మాటకు పాపాత్ముడైన మన్మథుడు నిరుత్తరుడయ్యెను.

## 5. సత్యాన్వేషణము.

వెనుకకు మరలి పోవుటెచ్చటికి? ముందడుగు కష్టతరముగనున్నది. రాత్రింబవళ్ళు ఘోరాంధకారముతో నిండి ఒకే విధముగ నున్నది. ఇంతవరకు సత్యము నెఱుంగజాలనైతిని. పంచాబ్దములు గడచిపోయినవి. కాని విశ్వసేవకు మార్గమే కనబడుట లేదు. సుప్రసిద్ధులగు నాచార్యుల యొద్ద కేగి సత్యప్రాప్తి కొఱకై నేజేసిన ప్రయత్నము విఫలమైనది. వారియొద్ద లభించినదంతయు నిస్సారమే. ఆలారకాలాం, ఉద్దకరామపుత్రులు జగద్విఖ్యాతులైన ఆచార్యులు. కాని వారియొద్ద యోగమనుపేరుతో కొంత వ్యాయామము తప్ప మరేమియు లేదు. ఈకసరత్తువలన ప్రపంచమునకేమిలాభము? ఆచార్య పదవికి ప్రయత్నించుమని వారుపదేశించిరి. కాని సత్యప్రాప్తిలేక, ఆచార్యుడనైన లాభమేమి? అంతకంటె రాజపదవిలోగల దోషమేమి? నా జీవితము వ్యర్థమైపోవునని నాకప్పుడప్పుడు చాల విచారము కలుగుచుండును. నేనెన్నో తపస్సులను చేసితిని. ఘోరాతిఘోరాక్షమగు నాహారమును గ్రహించితిని. మాసములకొలది నిరాహారుడనై యుంటిని. మృతకళేబరమువలె స్థిరముగ పడుకొని యుంటిని. కాని సత్యము లభించలేదు. ఇట్టి సమయముననే ప్రపంచము ప న్నొక మహాత్మునిగ గుర్తించినది. ఆశ్చర్యమే యిది. లోకమునకు నేనేమి సత్సందేశము నివ్వలేని సమయములోనే ఐదుగురు భిక్షువులు నన్నొక మహాజ్ఞానిగా దలచి సంవత్సరముల

కొలది నాసేవచేయుచుండిరి. ప్రజలు నన్ను పూజించుటకు వచ్చుచుండిరి. నిరర్థకులను, నిష్ప్రయోజకులను పూజించుట ప్రజలకున్నజబ్బు. ఎవ్వడు ప్రజలను పశుబలముచేత హింసించి, సేవాభారమును వారిమీద మద్దునో వాడే ప్రజలకు చక్రవర్తి. వాడే భక్తుడు (సత్పురుషుడు) వాడే యోగి యను ఆభిక్షుకులనుచూడు. నేను నిష్క్రియాపరుడనై కష్టములు సహించుచున్నంత వఱకు నాకు దాస దాసీలవలె సేవ చేయుచు, నేనేమియు ఈయకపోయినను సంతృప్తిజెందిరి. కాని నేను వ్యర్థపు దేహాడంబరములను త్యజించి వారికికొంత యీయదలచగ వారు పరుగెత్తి పోయిరి. ఇంకను నాకు సత్యము బోధపడలేదు. అయినను, అనేకములైన యసత్యములను కనుగొన్ని వానికి దూరము కాగలిగితిని. ఇక నాకు సత్య దర్శనము త్వరగా గలుగును. ఈ నాయున్నతిని అవనతిగా భావించి వారే (పండితులే) పరుగిడగ, ఇక సాధారణ ప్రజల విషయము చెప్ప పనిలేదు. వాస్తవముగ వారు పతితులే అయిన వారి పతనము "బుద్ధిపతనము". ప్రపంచము నేడీ పతన మార్గమునే అనుసరించుచున్నది. సత్యమును, శివమును, సౌందర్యమును చూచి ప్రజలు భయపడి పరుగిడు చున్నారు. అసత్యమునకు, అశివమునకు, అసుందరతకు భయపడి వానిని భక్తితో సేవించుచున్నారు. ప్రపంచమున మూర్ఖత్వము, భయము విలయ తాండవము చేయుచున్నవి. వీరు పశుతుల్యులని దయచూపవలెనో, లేక నరకీటకములని అసహ్యించుకొనవలెనో నాకు తెలియుటలేదు.

"ఓ మూర్ఖుడా! ప్రజలు నిన్ను తెలిసికొనలేరు. వారు దయార్యోగ్యులుకారు. దండనీయులు. పట్టణము నకు మరలుము. రాజదండమును ధరించి, ప్రపంచముమీద సవారిచేసినపుడు ప్రజలు నిన్ను బాగుగ స్మరణము చేసికొన గలరు."

"అరే! దుష్ట మన్మథుడా! నీవు నాకు నేర్పుదువా? ప్రపంచము నన్ను గుర్తించినను, గుర్తించకపోయినను నా కేమియు చింతలేదు. నేను అసత్యమార్గము నాశ్రయించి నచో ప్రజలు నన్ను గుర్తించగలుగుదురు. కాని దానివలన నాకేమి లాభము? నన్ను నేనే తెలిసికొనలేనప్పు డితరు లెఱింగిన లాభమేమి? ఎదురుగ నొక పెద్దరాతి చట్టుగలదు. దానిని నేనెఱుంగుదును. నీవెఱుగుదువు. ఇచ్చటికి వచ్చు వారందరు నెఱుంగుదురు. కాని ఏమిలాభము? తన్ను తా నెఱుంగదది. ఇతరులకు తెలియబడి తన్ను తా నెఱుంగని రాతిచట్టువలె నేను కాదల్చుకొనలేదు. ప్రపంచము నన్ను తెలిసికొన్నను లేకపోయినను నన్ను నేను తెలిసికొందును."

నా మాటలు విని దుష్ట మన్మథుడు పారిపోయెను. కాని, వాడు కొట్టిపోయినచోట నొప్పి యింకను తగ్గలేదు.

# 6. సేవా సంకల్పము.

ఈ మధ్య కొన్ని రాత్రులు నేనెక్కువగ నాలోచించు చుంటిని. ఏ సత్యాన్వేషణమునకై నేను ఇల్లు, వాకిలి త్యజించి, అడవులపాలయితినో, ఆ సత్యదర్శన మయినప్పుడు నాకెంతో ఆశ్చర్యము కలిగినది. సత్యప్రాప్తితో నా జీవితము సఫలమయినది.

ఇంతటితోనే జీవనము సఫలమయినదా? నాకు సత్య సాక్షాత్కారము కలిగి, ఆ యానందములో జీవిత పర్యంతము తన్మయుడనై యుండి, అవిద్యలో మునిగి ప్రపంచమును మరచి పోయినచో, నా జీవితము సఫలమగునా? సమాజములో నితరులు కన్నెత్తిచూడరానంత ఉన్నతస్థితిలో ఒక మానవు డుండగలడా? నాలుగువైపుల ప్రపంచమున నరక పరిస్థితు లున్నప్పుడు హాహాకారములతో చెవులు పగిలిపోవుచు దుర్గంధ ముచే ముక్కు పూడిపోవుచుండగా, మధ్యలో చిన్న పూలతోట వేసికొని, పుష్పసుగంధము నాఘ్రాణించుచు, దివ్యసంగీతము నాలాపించుచు, సర్వసుఖము లనుభవించుట సంభవమా? సమాజము అధోగతిలో నున్నంతకాలము వ్యక్తి ఉన్నతి నెంతవఱకు పొందగలడు. ప్రపంచమున పాపమున్నచో, అందులో అంతయో యింతయో నేనుగూడ అనుభవించితీర వలెనుగదా? జగత్తుకు ఉన్నతి కలిగించక నేనెంతవఱకు ఉన్నతిని చెందగలను?

అయితే ప్రపంచము నుద్ధరించుటెట్లు? సమాజము ఉన్నతి జెంద గోరుచున్నదా? సన్మార్గము ననుసరించ గోరుచున్నదా? నాకు లభించిన పరమ సత్యముయొక్క తేజస్సును లోకము సహించగలదా?

ప్రజలకు అతివాదమే మిక్కిలి యిష్టము. అతినే గొప్పగా భావించు లోకము దానికే దోసి లొగ్గును. ధన వైభవములను మితిమీరి అతిసంచయనముచేయు పూంజీపతులను, హద్దులు దాటిన అధికారములను చేబూనిన నిరంకుశ ప్రభువులను, దేహమును మిక్కిలి కృశింపజేసిన (వ్రత హఠ యోగాదులవలన) డాంబిక తాపసికులను ప్రపంచము పూజించును. అగమ్యము, ఆశ్చర్యము, భయము, నిరర్థకము ప్రజలకు పూజనీయములైనవి. ప్రేమ, సరళత్వములు (సాదా జీవనము) తేలికయయినవి.

ప్రపంచమునగల అతివాదములన్నియు దుఃఖ కారణములు. ఒకే రసాధిక్యతవలన భోజనమునకు రుచిరాదు. కేవలము లవణమునే వాడినచో శాకము రుచించదు. అట్లనే కారమధిక మయినను రుచించదు. బెల్లము రుచికరమైనను, కేవలము దానినే అధికముగా వాడినచో ఆహారములో రుచిపోవును. ఆహారము స్వాదిష్టముగా నుండవలెనన్న అన్నిరసములు మితముగా నుండుట అవసరము. జీవిత రంగమునగూడ నింతే. జీవితములో త్యాగము చాల అవసరము. కాని అనవసరముగా దేహమును శుష్కింపజేయుట

పాడిగాదు. భోగమవసరమే. కాని యింద్రియములకు బానిస కావలసిన పనిలేదు. మధ్యేమార్గము నవలంబించవల యును. అదే నిరతి మార్గము. ప్రపంచ మీ నిరతి మార్గ మును తెలిసికొనగలదా? అప్పుడు సత్యమార్గ మిదియని ప్రజ కెట్లు చూపగలను?

ప్రపంచ దృష్టి చాల విపరీతముగానుండుట మహాక బాధకరమైన విషయము. అవసరమైన వస్తువును అనవసర మైన దానినిగాను, అనవసరమైనవి అత్యావసరముగాను ప్రజలు గుర్తించుచున్నారు. ధ్యేయమైనది గౌణముగా బరిగణించ బడుచున్నది. ధ్యేయముకానిదానికి అధిక ప్రాముఖ్యము నిచ్చుచున్నారు. ఈవిధముగ ప్రజల దృష్టిలోనే లోపము న్నప్పుడు నేను వారికేమి తెల్పుదును.

మానవుడు సుఖము కోరుచున్నాడు. దుఃఖమును చూచి భయపడు చున్నాడు. కాని సుఖ దుఃఖము లనగా నేవియో తెలిసికొనుటకు ప్రయత్నించడు. ఈ సుఖదుఃఖములకు కారణభూతములు మనోవికారములని గుర్తించలేకున్నాడు. అందుచే, మనోవికారములకు వశీభూ తుడయి స్వయముగా దుఃఖమునను భవించుచు ప్రపంచమును దుఃఖపెట్టుచు, ఆదుష్ట చిత్త భ్రమలను తొలగించుటకు ఈష న్మాత్రి ప్రయత్నముగూడ చేయుటలేదు. అసలు ఆచింతయే లేదు. మనచుట్టు ఆవరించియున్న దుఃఖ కారణములను దూరముచేసికొనవలెనను చింతగూడమానవునికి లేదు. ఇక మా నవునికిగలచింతలెవ్వియనగా "స్వర్గ మెచ్చటనున్నది? ఎట్లున్నది?

అచ్చట అప్సరసలు లభించెదరా, లేదా? నరకమెచ్చట నున్నది? ఈశ్వరుడెచ్చటనున్నాడు? ఎట్లున్నాడు? పరలోకమెచ్చటనున్నది?'' ఈవిధముగ నిరర్థకమైన విషయములతో తన తల పగులకొట్టుకొను చున్నాడు. ఈవిషయములనాధారముగా దీసికొనియే పార్టీలను తయారు చేయుచున్నాడు. నిందలకు, పోట్లాటలకు దిగుచున్నాడు. ఇదంతయు ధర్మమేనని అతని నమ్మకము. ఇట్టి ప్రపంచమునకు నేనేమి తెలియజేయగలను? ఆడంబరము, పరలోకము మొదలయిన ఆహ్లాదజనక కల్పనలచే మోసగించువారిని చూచిన ప్రజలకు చాల సంతోషము. కాని, నిజమును చెప్పువానిని, అజ్ఞేయమును జ్ఞేయమని, సుఖమునకు సరియైన, సులభమైన మార్గమిదియని చూపించువానిని పిచ్చివాడని, ఈ పిచ్చి ప్రజలు నుడువుదురు. తమను చీకటి కొట్టులోనికి నెట్టి, తమ ముకొనుటకు అవకాశము కల్పించి. ఏమియు లభించకున్నప్పుడు మానసిక కల్పనలతోనే సంతృప్తి పడదగిన పరిస్థితులు కల్పించునట్టి డాంబికాచారపరులనే ప్రజలు పూజించుచున్నారు. మానవుడు ప్రకాశమును కోరుటలేదు. అచ్చట కల్పనల కవకాశము లేకపోవుటయే కారణము. ప్రకాశమున్నచోట పరిమితముగాను, చక్కగాను కనబడును. దానితో మనుష్యునకు తృప్తిలేదు. సంతోషము లేదు. అందుచే అంధకారమునందేమునిగి అనంత కల్పనలు చేయ సంకల్పించుచున్నాడు. ఇట్టి వారికి నేను ప్రకాశమును చూపించుటలోగల అర్థమేమి? కాదు, కాదు. నేనేమియు

చేయదలచుకొనలేదు. ప్రజలు కల్పనలలోనే తన్మయు లగు దురుగాక! నేను నాలోనే మునిగియుందును.

పాపిష్ఠుఁడగు మారుఁ డిట్లు పలుకరించుచున్నాఁడు. మూర్ఖుఁడా! నీవు సేవా పాశములలో పడవలదు. నీవు సత్యమును, శివమును (కల్యాణమును) ఇయ్యఁదలచితివి. కాని జగత్తు సౌందర్యము నాకాంక్షించుచున్నది. నీవు సరళమైన మార్గమును చెప్పఁబూనితివి. సరళమార్గము నాకు తెలియును. నీవు చెప్పవలసిన పనిలేదని జగత్తనుచున్నది. జగత్తుకు ఉపయోగించువాఁడవు కావు. మూర్ఖుఁడా! ప్రపంచమున మోసము చేయువారికే విజయము లభించుచున్నదనియు, ప్రజలు నిన్నుఁ జూచి నవ్వి, ఉపేక్ష చేయుచున్నారని నీకు తెలిసినప్పుడు నీవు చాల ఖిన్నుఁడవు కాఁగలవు. ఫలితము లేదని నిశ్చితముగా తెలిసిన చోటికి పోవలసిన పనియేమి? నీకు సిద్ధి లభించినదిగదా? దానితో సంతోషపడుము. నరక ద్వారమును ప్రవేశింపఁగోరు ప్రపంచము నచ్చటికే పోనిమ్ము. నీవు ఆపవలదు. పోవువారిని పోనియ్యవలసినదేగాని, వారికై నీవు చీకాకు చెందవలసిన పనిలేదు. బురదను పాలు, మీఁగడగా జేయఁగోరి, నీ పాలను దానిలో పోయుటెందుకు?"

కాని ఈ దురాత్ముఁడైన మారుని దూరముచేయుటకు, సంపూర్ణ సద్వృత్తులకు సభాపతియై నా హృదయమందున్న బ్రహ్మ సతతము జాగరూకుఁడైయున్నాఁడు. మారుని సంబోధించి యిట్లు చెప్పితిని.

"అరే, ధూర్తుడా! ప్రపంచమున ధూర్తులకు విజయము లభించినంత మాత్రమున ధూర్తులందఱకు చక్రవర్తియైన నీకును విజయము కలిగించవలయునా? ప్రపంచమున అందఱు నన్ను గుర్తించక పోయినను కనీసము ఒక్కరైనను గుర్తించుదురుగదా? బుద్ధుడు ఒక్కవ్యక్తిని ఉద్ధరింపగలిగినను తక్కువేమియుకాదు. అయినప్పటికి ఇద్దరగుదురుగదా? బుద్ధుడు జ్ఞాని, జినుడు, యోగి కాన ఫలితాఫలితములను లెక్కించడు. అసఫలత్వములు వానిని నిరాశుని చేయజాలవు. కర్మను చేయుట మనుష్యుని స్వభావము. కర్మచేయక సుఖించ జాలడు. జడత్వము (నిష్కర్మణ్యత) అతనికి పనికిరాదు. ఈ విధముగ ప్రతిపరిస్థితిలో పనిచేయుటయే మనుష్య స్వభావమైనప్పుడు బుద్ధుడు జన జాగరణమనే పని (జనులను మేల్కొల్పుట) నెందులకు చేయకూడదు?

ఈ బ్రహ్మానురోధమే నాకు మంచిమార్గమనిపించినది. నిష్కామ (నిరపేక్ష) సేవకుడను కావలెను. తమను బాగు చేయు వైద్యుని గుర్తించలేనట్టి రోగితో ప్రజలను పోల్చవచ్చును. ఆ రోగి వైద్యుని తిట్టి, బాధించును. పరోపకారియైన వైద్యుడు ఈ దుర్వ్యవహారములను లెక్కించక, రోగికి చికిత్సచేయునట్లు నేనును ప్రపంచమునకు చికిత్స చేయ దలచితిని. నా యీ నిరపేక్ష, దృఢనిశ్చయమును చూచి పాపియైన మారుడు మరల పరాజితుడై పారిపోయెను.

# 7. అసఫలత్వమును జయించుట.

ఈ దేశమున ప్రజలకు ఆలోచనశక్తి లోపించినది. ఏమనుష్యుడైనను ఆలోచించి, విచారణచేసి, ఒకానొక సత్యమును ప్రజల కందించగలడని వీరికి తెలియదు. ఎవరయినను కొంతతపస్సుచేసి స్వాత్మానుభవమున నొక సత్యమును కనుగొని ప్రపంచమునకు సమర్పించినచో, "ఈ సత్యము నెచ్చటనుండి తీసికొని వచ్చితివి, ఏశాస్త్రములో ఏగురువువల్ల నీకది బోధపడినదని ప్రజ లడుగుదురు. శాస్త్రములకు, గురువులకు మూలము అనుభవమను విషయము ఈ అమాయకులకు తెలియరాకున్నది. శాస్త్రకారులందఱు అనుభవముతోనే ఈ ప్రపంచమును తెలుసుకొన్నప్పుడు, నేడుమాత్రము ఎవరయినను ప్రపంచమునగల సత్యమును ఎందుకు తెలిసికొనజాలరు?

'ఉపకుడు', 'ఆజీవకుడు' అమాయికులుగానే కనబడిరి. నా పరిచయమైనమీదట, నా ముఖమునుండి కొన్ని క్రొత్త విషయములను విని ఆశ్చర్యాన్వితులైనారు. సంవత్సరముల కొలది తపస్సుచేసి, రాత్రింబవళ్ళు ధ్యానమగ్నుడనైయుండి ఈ అమూల్య సత్యమును నేను కనుగొంటినను విషయము వీరికి తోచకపోయినది. నా నూతన సత్యమును విని 'మీ గురువెవరని' నన్నడిగిరి.

"నాకు గురువను ఒకవ్యక్తి ఎవ్వరు లేరు. ఈసమస్త జగత్తు నాకు గురు"వని నేను జవాబిచ్చితిని. విశాల ప్రకృతియే నాకు పుస్తకము. అనుభవముతోనే నాగ్రంథము సద్యాయనము చేసితిని. కాన నాకు నేను గురువును. నేను అశ్రితుడను, శాస్తను, సుబుద్ధుడను ప్రపంచమున ధర్మ చక్రమును త్రిప్పుటకు కాశీకి వెళ్ళుచున్నాను."

"మహాశయా! నీవు చెప్పినట్లు జరిగినచో అనేకమంది జినులు తయారగుదురే!" అని ఉపకుడు నవ్వెను.

"నీవంటివారే అనేకమంది జినులుగా చెప్పబడుదురు. జినత్వము చర్మముమీద కనబడదు. దానికి బాహ్యాడంబర మేమియు లేదు. ఆత్మశుద్ధిమీదనే జినత్వ మాఆధారపడి యుండును. ఎవ్వడు సత్యమును సంపర్శించ గలుగునో, వికారములను జయించగలుగునో, వాడే జినుడు."

"సరే! నీవేజినుడవు, సోదరా", యనుచు ముఖము చిట్లించుకొని ఉపకుడు వెళ్ళిపోయెను.

"ఉపకుడు సన్యాసి. కొంత విద్వాంసుడైగూడ నన్ను తెలిసికొనలేకపోయెను. ఇక మామూలు ప్రజలు నన్నెట్లు తెలిసికొనగలరు"అని — ఆలోచించుచున్నాను.

"జీవించి సంతనజుకు ప్రజ లెవరిని గుర్తించరు. నన్ను గూడ తెలిసికొనలేరు. కాని ఏదో ఒకరోజున ప్రజలు నా మార్గమునే తప్పక అనుసరించెదరని నాకు పూర్తిగా నమ్మక

మున్నది. నేను బోధించు సత్యమువలన జగత్తునకు కల్యాణము కలుగును. కాన నేనుకాకపోయినను రేపయినను ప్రపంచమెఱుంగగలదు. సత్యమును తెలిసికొనుటకు పండితులు మాత్రము ప్రయత్నమే చేయలేదు. మామూలు ప్రజలలోకంటె పండితులలోగల గుడ్డినమ్మకములే (అంధశ్రద్ధ) చాల భయంకరముగా నున్నవి. సాధారణ ప్రజలు తమకుగల గుడ్డి నమ్మకములను సమర్థించుకొనుటకు బుద్ధివాదమును ఆధారముగా తీసికొనరు. కాని పండితులు బుద్ధివాదముచేత గుడ్డి నమ్మకములను సమర్థించుకొందురు. ఈ ఆత్మవంచన వలన పండితులు సత్యమును సందర్శించజాలరు. పండితులుగాకున్నను, సాధారణ బుద్ధిగలిగి ఆలోచనశక్తిగల వారు సత్యము నెఱుంగ గలుగుచున్నారు. వందమంది పండితులలో నొక్కరు సత్యమును తెలిసికొన గలిగినచో, మామూలు ప్రజలలో వందకు 10 నుండి 20 వఱకు సత్యము నెఱుంగ గలుగుదురు. ఉపరుడు పండితుడు. కాని వాని అంధశ్రద్ధకు అంతము లేదు. తన శ్రద్ధలోగల అంధత్వము సత్యము గ్రహించజాలకున్నాడు. బుద్ధివాదము తెరను కప్పెను. జగత్తులో ఇట్టి ఉపరులెందరో నిండియున్నారు. వారు నన్ను గుర్తించజాలరు. ఎవరికి అంధశ్రద్ధ లేదో, అహంకారము నశించినదో, ఎవరు జిజ్ఞాసువులు, ముముక్షువులో వారు విద్వాంసులయినను, కాకపోయినను నన్ను తెలిసికొన గలరు. వారికి నేను సత్య సాక్షాత్కారమును కలుగజేయ గలను.

" 'ఆలారకాలామ్', రాజపుత్రుడైన 'ఉద్దకుడు'ను ఇహలోకయాత్ర చాలించిరను సమాచార మిప్పుడే అందినది. చాల విచారముగానున్నది. వీరు సుపాత్రులు (యోగ్యులు). తెలిసికొనవలయునను అభిలాష (జిజ్ఞాస), తెలిసికొనగల శక్తి (మేధస్సు), నిష్పక్షపాతబుద్ధి – ఇవి వీరికిగల సుగుణములు."

"నేను వీరిద్దరివద్దకు విద్యాభ్యసనార్థమై వెళ్ళితిని. వారు శ్రద్ధతో విద్య నేర్పిరి. శీఘ్రముగా విద్యనంతయు సమాప్తముచేసి, యింకేమైనా విద్య యున్నచో నేర్పుడని కోరగా, వారు నిర్మల హృదయముతో నీవిధముగా జవాబిచ్చిరి. "మావద్ద నిక విద్య లేదు. ఇప్పుడు నీవంతయు నేర్చుకొన్నావు. కాన ఆచార్యుడవు కమ్ము". కాని నేను ఆచార్యుడను కాదలచుకొనలేదు. పరమ సత్యమును తెలిసికొన సంకల్పము కలదని చెప్పితిని. అప్పుడు వారు మరొకచోటుకు వెళ్ళుటకు ఆజ్ఞయిచ్చిరి. ప్రపంచమున ఇటువంటి సరళ హృదయులైన పండితులు అరుదుగా కన్పించుదురు. నేడు వారే జీవించియున్నచో నా అంతిమసత్యమును వినియుందురు. సంతోషపడియుందురు. సంతసించి, నా మార్గమును స్వీకరించియుందురు."

కాని నేడు ప్రారంభమే శుభకరముగ లేదు." ప్రథమ కబళే మక్షికాపాతః" అన్నట్లయినది. ఇది అపశకునమని తలంతునా? ఛీ! నేనిప్పుడు శకునాపశకునముల కతీతుడను.

ఇకనెగూడ ప్రపంచములో భ్రమయే. శకునము, అపశకునము కల్పితములై సభూతములే. ఇవి దుర్బల హృదయముగలవారిని భయపెట్టుచుండును. ఇవి నన్నేమి చేయగలవు? నాకు సాస్లు నాకు ఓటమి సంభవించినను నూటొకటవసారి ప్రయత్నము చేయుటకు సిద్ధముగా నున్నాను. అపశకునమును వస్తువును మాటిమాటికి విఫలుడనైనగూడ దాని శక్తిని క్షీణింప జేయగలను. నేను శకునాపశకునములను లెక్కించను. మానాపమానములను గుఱించి చింతించను.

ఉపకుడు నేను నన్నవమానించి, తిరస్కరించి నాడు. ఇట్టి అవమాన తిరస్కారముల నెన్నింటినో నేను సహించవలసియుండును. ఈ విషయము నేను తాగినట్లయే గాక జీర్ణించుకొనవలెను. మహాదేవుడైన (శివునికి) వానికిగరళ మును జీర్ణించుకొనుట సహజమేగదా!

## 8. నిజమైన త్యాగులు లభించుట.

ఈ స్వల్ప కాలముననే యింతమంది సన్న్యాసము చేసికొనగలిగినవారు లభింతురని నేను తలంచలేదు. ప్రజలు లక్షలాది సంపదలను త్యజించి ఈ సాధు సంఘమున ప్రవే శించుచున్నారు. ఇది సాధు సంస్థకు చాల గౌరవనీయమైన విషయము. వైభవములను త్యజించినవారు నాకు శిష్యులుగా జేరిన నా సంస్థకు చాల గౌరవము, బలము లభించును. ఇట్టి

వారికి ప్రలోభములను జయించుశక్తి అధికముగా నుండును. ప్రలోభములు పీడించునప్పుడు వారు ఈ విధముగ నాలోచించుకొందురు. ఈ సాధుజీవితముకంటె, గృహస్థులముగ నున్నప్పుడే మనకు షడ్రసోపేత భోజనము, రత్నాంబరములు, స్వేచ్ఛాచరణము లభించుచుండెడివిగదా! ఇప్పు డీభిక్షువుల వలన భోగముల ననుభవించుటలో గల అర్థమేమి? తమ దారిద్ర్యమును దాచుకొనుటకు లేక ఏదో విధముగ నుదర పోషణము చేసికొనుటకు నా సాధుమండలిలో చేరినవారు ఈక్రింది విధముగ నాలోచింతురు. "మన కిచ్చట భోజనాది వ్యవస్థలు మన యిండ్లవద్దకంటె బాగుగ నున్నవా, లేవా? అని" అట్టివారు నా సంఘమున కేమియు శక్తి నివ్వ జాలరు. నా సంఘమునుండి ఏమియు పొందజాలరు. వారు సాధువు లగుట దుస్సాధము.

తమకున్న ఐశ్వర్యముల నన్నిటిని త్యజించిన వారనేకులు గూడ నా సాధు సంఘమున జేరుట చాల ముదావహము. త్యాగమువలన గలుగు ఆనందము వారనుభవించుచున్నారు. శారీరక సుఖములకంటె మానసిక సుఖమునందే వారత్యంత సంతోషమును పొందుచున్నారు. వాస్తవముగ సుఖము మానసిక వస్తువు. కాని ప్రజలకిది బోధపడుట లేదు. శరీరాది బాహ్యవస్తువుల యందే వారు సుఖమును వెదుకుచున్నారు. ఆరోగ్యము సరిగా లేనిచో, జిహ్వ బాగుగా లేనిచో, బుభుక్ష లేనిచో, షడ్రసోపేతమైన భోజనమునందున్న రుచికనబడదను విషయమును ప్రజలాలోచించ

లేకున్నాను. శరీరము నీరోగమై, ఆకలి బాగుగా నున్నప్పుడు ఎండు రొట్టెగూడ పడ్రసోపేత భోజనమువలె నుండును. ఆనంద ప్రవాహ మభ్యంతరమునుండి ప్రవహించును. గాని, బాహ్యమునుండిగాదు. ఈ తత్త్వము తెలిసినవాడే త్యాగి లేక సాధువు కా గలుగును.

భద్ర, పిప్పలుల విషయము తెలిసికొన్నప్పుడు, త్యాగ మహత్త్వము వలన కలుగునట్టి ఆనందముతో నాహృదయము నిండిపోవును. "భద్ర" స్వర్ణదేహచ్ఛాయలతో సౌందర్యవృష్టిని కురిపించు నవయౌవనవతి. ఒక అసమాన ధనాఢ్యుని కూతురు, ఒక శ్రీమంతునికి కోడలు. విద్వాంసుడు, శ్రీమంతుడు, ఆరోగ్యవంతుడు, యువకుడైన వ్యక్తికి ధర్మపత్ని. కాని ఆమె ప్రపంచ కల్యాణమునకు, ఆత్మహితార్థము గృహస్థాశ్రమమును త్యజించినది. ఇట్టి సుగుణవతి, సౌందర్యవతియగు పత్నిని త్యజించి, విశాల సంపత్తిని తృణప్రాయముగ వదలి, వందలకొలది, దాసదాసీలను బానిస జీవితమునుండి ముక్తినికలిగించి, పిప్పలిగూడ గృహమును త్యజించి, నేడు నాయొద్ద బ్రహ్మచర్యవ్రతమును సలుపుచున్నాడు. ఇట్టి త్యాగులే, ఏస్వార్థములకు, లోభములకు లోనుగాక ప్రజాసేవ చేయగలుగుదురు. పిప్పలి చేసిన త్యాగమువలన వందలకొలది దాసదాసీలు స్వతంత్రులయినారు. అతని సంపత్తి వందలకొలది గృహములలో పంచిపెట్టబడి వారందరికి ఆనందవర్షమును కురిపించుచున్నది. దీనివలన ప్రపంచమున కెంతయో ఉపకారము కలిగినది.

మనుష్యునకు అన్నవస్త్రములకు కావలసినది కొంచెము మాత్రమే. ప్రజలందరు తమ కవసరమైనంతవరకు అన్న వస్త్రముల నుపయోగించుకొను పక్షమున, ప్రపంచమున దారిద్ర్యమే కనబడదు. ఆర్థికసంఘర్షణ క్షీణించిన క్షణము ననే, ప్రపంచమునగల సర్వ పాపములు దూరమైపోవును. మానవునియందుగల తృష్ణయే ప్రపంచమును దుఃఖమయము చేసినది. ఈ దుఃఖమయ ప్రపంచమును సుఖమయముగా జేయుటయే నా ప్రయత్నము.

నా సాధుసంఘమున ప్రజలు చేరుకొలది, ప్రపంచ మునగల ఆర్థిక సంఘర్షణ తగ్గిపోవును. జగత్సంపత్తిలో భాగస్వాములు తక్కువైపోదురు. విశేషించి, ధనవంతులు చేయు త్యాగమువలన ప్రపంచమునకు చాల లాభము. కారణము - ధనము వారియొద్ద నిలువబడిపోయినందువలన, నిర్ధనులకు చాల హానికలుగును.

భద్రి - పిప్పిలులవంటి శ్రీమంతులు గృహత్యాగము చేయుచో, ప్రపంచమునుండి దాసత్వమే పూర్తిగా నశించి పోవును. దారిద్ర్యము నామమాత్రమునకే మిగిలిపోవును. ఎంతవఱకు నాకు విజయప్రాప్తి కలుగునో చూడగలను.

ప్రపంచమునకు శ్రీమంతులేగాదు భారము సాధు వులుగూడ. ఈ సాధువేషధారులుగూడ పరిగ్రహమునకు నిలయులైనారు. వీరి ఆడంబరము రాజులకంటె తక్కువ

లేదు. వీరు సత్యమును స్వీకరించుటకు ప్రయత్నించరు. ఎవ్వరయినను, గృహస్థతత్వము నావిష్కరించి, జగత్తును సత్య-వివేక మార్గములందు నడుపబూనినప్పుడు, వీరు వారికి విఘ్నములు కలిగింతురు. కాని ‘సారిపుత్ర’-‘మౌద్గల్యాయనులీ కుత్సితమార్గములందు పోక, నాయొద్దబ్రహ్మచర్యవ్రతము గడుపుచున్నారు. వీరెంతో ధన్యులు.

నేడనేక సాధు వేషధారులు పరలోకమను పేరుతో అమాయకులను మోసగించి ధనమును సంపాదించుచున్నారు. కుత్సితరీతులను పూజించుచు, కూపవాసములను పెంపొందించుచు, జ్ఞానవికాసమును, విమర్శనశక్తిని(వివేకమును) శక్తికొలది ప్రయత్నించి ఆపుచేయుచున్నారు. వీరే నేడు లోకములో పూజ్యులు. వీరే శ్రీమంతులు. వీరే మహాత్ములుగూడ. సారిపుత్రు-మౌద్గల్యాయనులు ఇట్టి సాధుసంఘముననే యుండిరి. కాని వీరు జిజ్ఞాసువులు, సత్యాన్వేషణా తత్పరులు. అందుచేతనే, భిక్షాటనమునకు వెళ్ళిన అశ్వజిత్తు అనే సాధువువలన సందేశమును విని, వీరు వెంటనే నన్ను శాస్తగాతలచి, పరివ్రాజక సంఘమువలన కలుగు మహత్పదవులయందున్న స్వార్థములను వదలి, నాయొద్దకు చేరి బ్రహ్మచర్యవ్రతము నాచరించుచున్నారు.

సంజయుడనే సన్న్యాసి వీరికి క్రింది విధముగా జెప్పెను:- ఆప్తులారా! ఈ అనర్థమును చేయవలదు. మీకు పరివ్రాజక సంఘమువలన లభించవలసినదంతయు

లభించినది. నేడే మీ యిద్దఱకు ఈ పరివ్రాజకసంఘ మహాన్తుపదవి నీయనున్నారు. అనేక శ్రీమంతులు ఈసంఘమునకు భక్తులు వారందఱు మీ ఆజ్ఞను శిరసావహించువారే. మీ స్తుతిచేయుదురు. శాక్యపుత్రునియొద్ద మీ కేమి లభించును? అచట వారి శిష్యులలో మీరు నొకరుగా నుండి పోవలసివచ్చును. ఇచ్చట మీరు మహాన్తులు (మఠాధీశ్వరులు) కావచ్చు. అచ్చట కేవలము సేవనొనరించు శిష్యులగుదురు. మీకు హితమెచ్చటనుండునో ఆలోచింపుడు. సారిపుత్ర మౌద్గల్యాయనులు- ఈ క్రిందివిధముగ జవాబిచ్చిరి.

"నీవు చెప్పు మహాన్తుపదవివలన జీవితము సఫలము కాదు. సత్యప్రాప్తివలన జీవితము సఫలత్వము నొందును. మహాత్ముడైన గౌతమునియొద్దకు వెళ్ళి ఏ సత్యమును పొందగలమో, ఎట్టి జనహిత కార్యములను చేయగలమో, అవన్నియు నిచ్చటనుండి చేయజాలము. ఇట్టి నిస్సారమైన మహాన్తుపదవివలన ప్రయోజన మేమి? అచ్చట శిష్యులముగ నుండి, ఎవరికైనను సేవ చేయవలసివచ్చినచో, దానివలన మాకు కలుగు హాని ఏమి? ఇచ్చటివలె ఒకరు మనలను పూజచేయనిచో వచ్చు మహానర్థమేమి? భక్తిపరవశులమై, మనకు మించిన ఒక మహాత్మునికి సేవచేయుట ధర్మము, సౌభాగ్యమేగాక, మహానందముగూడ. ఈ ఆనందమునకు మన మెందుకు భయపడవలెను? సాధునైయుండి పరిశ్రమను (సేవాశుశ్రూషలను) చూచి భయపడవలసిన పని యేమి? ఇక సన్మార్గము, యశస్సు; ఇవిఅంతర్వాహినులుగాప్రవహించును.

ప్రపంచస్తుతివలన కలుగు సుఖముకంటె సత్యమార్గమునందు ప్రతిష్ఠితుడగుటవలన కలుగు ఆత్మసంతోషము వెయ్యిరెట్లు శ్రేష్ఠము. ఆవుసులారా! మనకు బాహ్య మహత్త్వములకన్న ఆంతరిక సామ్రాజ్యము కావలెను. దానికి నేను వెళ్ళుచుంటిమి."

ఈ విధముగా సత్యాసక్తి, జనసేవానురక్తి, ఆత్మశాంతులచే ప్రేరేపింపబడి ప్రజలు నన్ను సమీపించుచున్నారు. ఇట్టి త్యాగులున్నంతవఱకు మానవసమాజమున కత్యున్నతమైన భవిష్యత్తుకలదని మానవ సమాజమునందుపకులున్నారు. అట్టిచోటనే శారీపుత్ర, మౌద్గల్యాయన, భద్ర, పిప్పలులు నున్నారు. అందువలన నిరాశను పొందవలసిన యవసరము లేదు.

## 9. అపరిపక్వ సాధువులు.

ఆనందుని శిష్యులలో ముప్పదిమంది ప్రవ్రజ్యను త్యజించి గృహస్థులైరన్నవార్త యిప్పుడే నా కందినది. వారందఱు నవయువకులు. అంతియేగాక నా భిక్షువులు అత్యసభ్యముగా ప్రవర్తించుచున్నారనునట్టి మరియొక సమాచారమును ఇప్పుడే చేరినది. వీరు భిక్షాటనము చేయునప్పుడు వీరు చేయు గోలనుబట్టి వీరు యుద్ధము చేయుచున్నారాయని అనిపించును. భిక్షనడుగునప్పు డొకరి

కంటె మరియొకరు ముందుకు పరువెత్తుదురు. ఎచ్చట పట్టిన నచ్చట యెంగిలి పాత్రలను ముందుకు చాచుదురు. వీరిని చూచినప్పుడు వీరికి సామాన్య ప్రజలకు మధ్య కొంత భేద మున్నదని యెవరనగలరు?

ఈ మూకపురుషులను, అయోగ్యులను, నెన్నియో సారులు 'ఛీ' కొట్టితిని. సద్వ్యవస్థను సదాచారమును నేర్పుటకొరకై వీరి కుపాధ్యాయులను, ఆచార్యులను నియమించితిని. ఉపాధ్యాయులకు ఆచార్యులకు సేవాశుశ్రూషలు చేయుట వీరి ధర్మము. వీరికి విద్యా వినయములను బోధించుట వారి ధర్మము. ఇవ్విధముగా వీరియందుగల దుర్వ్యవస్థ దూరమైపోగలదు. పరస్పరావలంబనముచే వీరు వ్యాకులతలు లేక నుండగలరు.

ఆనందుని ముప్పదిమంది సాధుశిష్యులు పరువిడి పోయినందున మహాకాశ్యపు డానందునిపిలిచి యతి నిష్ఠురోక్తులు పలికెను. ఆనందునికి దూరదృష్టి లేదు. ఆతడు వర్తమానమునే చూచును. నగదు పుణ్యమునకు పూజారి. అతి స్వల్ప సంతోషి. ప్రతి కార్యమును శీఘ్రముగా చేసివేయును. భవిష్యత్తులో దీని ఫలిత మేమగునోయనికూడ నాలోచించడు. మహాకాశ్యపుడు చీవాట్లు పెట్టుటవలన మన మాశ్చర్యము నొందవలసిన పనిలేదు. ఆతడే నన్ను సమీపించినచో నేనంతగా బెదరించెడివాడనుగాను. కాని శిష్యమోహమునకు దూరముగా నుండుమనిమాత్రము చెప్పెడివాడను.

కర్షకుడు క్షేత్రమునందు బీజావాపనమును చేసిన తరు వాత ధాన్యపు మొక్కలతోపాటు గడ్డి గాదము పెరుగును. గడ్డి గాదము చెడిపోవునను భావముతో దున్నుట మానుకొనరు. నా భిక్షుకసంఘముయొక్క పరిస్థితియు నిట్టిదే. నా భిక్షుకసంఘ క్షేత్రమునందు సారిపుత్ర, మహాద్గల్యాయనుల వంటి ధాన్యపు మొక్కలును ఉన్నవి. అటనే భిక్షకోటకు వెళ్ళి గోలచేయునట్టియు భిక్షదీక్షను తీసికొని లెదుపరి పను గిడిపోవునట్టియు గడ్డి గాదములును ఉన్నవి. అట్టి గడ్డిని పెరికివేయుట మన ధర్మము. లేక ఆనందుని శిష్యునివలె స్వయముగా జారిపోవుటయైనా జరుగవలయును. ఇందులో భయమునకుగాని, సిగ్గునకుగాని యెంతమాత్రము ఆస్కారము లేదు. ప్రతిమానవుడు కొంతసమయమునకైన గృహత్యాగముచేసి ఏకాంత జీవితమును గడుపుటవలన అనంత లాభము గలుగునని నేను దృఢముగా నమ్ముచున్నాను. భిక్షుసంఘమున జేరి ఎవరి కెన్నిరోజు లవకాశమున్న వారన్ని రోజులుండవచ్చును. అవకాశము లేనప్పుడు వెళ్ళవచ్చును. దీనివలన నాకేమాత్రము చింత లేదు. భిక్షుసంఘమును నేను నిందింపను. ఈ సంఘటనలను జూచి నాభిక్షుసంఘమును నిందించువారికి "గడ్డిగాదము పెరుగనట్టి క్షేత్రమును నాకు చూపించుడని" మాత్రము నేనడుగుదును.

---

# 10. సేవాపరాయణులను సవిరాకరించుటకు గల కారణము.

"గౌతమ శ్రమణుడు గృహములను ఖాళీ చేయు చున్నాడు. భర్తలను సాధువులుగామార్చి భార్యలయొక్క సుమంగళిత్వమును నాశనము జేయుచున్నాడు. వృద్ధుల కాధార భూతులైన కుమారులను భిక్షువులనుగాను పసిపిల్లల కాధార భూతులైన తండ్రులను సాధువులనుగా మార్చు చున్నాడు. గొప్ప గొప్ప శ్రీమంతుల గృహములను ఖాళీ చేయించెను. ఒక వేయిమంది జటిలుల యొక్క శిరములను ముండనము జేయించెను. సంజయుని యొక్క రెండువందల యేబది మంది శిష్యులనుగూడ ముండనము చేయించి తన భిక్షుసంఘమునందు జేర్చుకొనెను. ఇప్పుడు మరెవ్వరిని తీసికొనిపోవుటకు వచ్చెనో", యని ప్రజలనుకొనుచున్నారు.

మూర్ఖప్రజలు పైవిధముగా నన్ను నిందించుచున్నారన్న సమాచారమును నాశిష్యులు నాకు చెప్పిరి. నేను వారికిట్లు జవాబొసంగితిని.- మీరేమాత్రము చింతించవలదు. ఈనింద లన్నియు నొక సప్తాహమునకు మించియుండబోవు. సత్యము ముందు ఇవి యొక క్షణమాత్రమైన నిలువజాలవు.

ఇది ప్రసవవేదనగా నున్నది. సమాజమునందు సమత్వ స్థాపనకు ఎంతైన నవసరము. శ్రీమంతుల గృహములను

నేను పెకలింప దలచుచున్నాను. కారణము, అట్లుచేయుట వలననే శ్రీహీనుల గృహములను నిర్మించగలము. భోగోన్మత్తులైన స్త్రీలు సంపత్తియందుగల నిస్సారతను తెలిసికొని దానముచేయుట నేర్చుకొనగలరు. ప్రస్తుత సమాజము భోగ విలాసములలో నధికముగా చిక్కుకొని యున్నది. దానిని మరొకవైపునకు తీసికొనివచ్చుట కిట్లు జేయుట యవసరము. సమయము వచ్చినప్పుడు నేనీమార్గమునుగూడ నిరోధించగలను. నా మార్గము మధ్యమమార్గము. నేను నిరతివాదిని. భోగవిలాసుల సంఖ్య తగ్గుట చాల యవసరము. సంపత్తి విభాగమున కిదెంతో ముఖ్యము. సన్యాసుల సంఖ్య పెరిగిపోయి సమాజము వీరి భారమును మోయజాలనప్పుడు గృహస్థాశ్రమమున కీగొడ్డలిపెట్టు కలుగునప్పుడు, నేను తప్పక ఈ పద్ధతి నాపుజేయగలను. ప్రస్తుతము శ్రీమంతుల గృహములను ఖాళీచేయించుటమాత్రము చాల యవసరము. దీనివలన సమాజమునందుగల వికారములు తగ్గిపోయి సమాజమునకు యోగ్యులైన సేవకులు లభించగలరు. లోకము నున్మత్తుడైన రోగితో పోల్చవచ్చును. చికిత్సవలన కలుగు కష్టమునే యది గుర్తించును. చికిత్స వలన కలుగు లాభము నది గుర్తింప జాలదు. వైద్యులకు మాత్రమే యీ లాభము తెలియును. అందువలన వైద్యుడు రోగియొక్క ఆక్రోశమునకు జింతింపడు. లోక చికిత్స కొఱకును లోకులయొక్క ఆక్రోశములను గుఱించి నేనును చింతింపను.

# 11. నారీత్వమునకు నమస్కారములు.

ఇప్పుడు నాకు మాతృభూమియందు దేశమాత్రము వ్యామోహము లేదు. సమస్త విశ్వము నాకు మాతృభూమియె. కాని నేడు కపిలవస్తునగరమునకు రాగా ప్రపంచములో నొకమూలకు వెళ్ళినట్లుగా నాకనిపించలేదు. పూర్వ సంస్కారమువలన అన్యస్థానములకంటె నిచ్చట నొక నూతన విశేషానుభవముగలిగినది. నేను బుద్ధుడనైనప్పటికి ఇంకను మారుడు నామీద తన ఆక్రమణలను జరుపుచునేయున్నాడు. "మూర్ఖుడా! నీవు గృహత్యాగినప్పటికి కులనగరమునకే తెంచితివిగాన నీదర్శనముకొఱకు ఎనరధికముగా నుబలాటపడుచున్నారో వారి గృహమునకే మొదట నీవు వెళ్ళవలయును. మీ తండ్రి, నీభార్య, అన్య స్వజన పరిజనులు సంవత్సరములనుండి నిన్ను జూచుటకు ఆతురతచెందుచున్నప్పుడు తక్కిన గృహములన్నిటినివదలి నీ గృహమునకే మొదట భిక్షనడుగుటకు పొమ్ము" అని మారుడు పలికెను.

"ఓమారుడా! బుద్ధుడు వీతరాగుడు. జినుడైనవానికి ఈపక్షపాతము శోభించదు. నాదర్శనమునకై ఎవరికుత్సాహమున్నది, ఎవరికుత్సాహములేదని విచారించుటకంటే నా భిక్షుసంఘమునందు ఎవరికుత్సాహమున్నది ఎవరికుత్సాహము లేదని విచారించుటయే నాకుచితము. నాభిక్షుసంఘమునందు నాగృహమునకు సంబంధించిన స్వజన పరిజనులకెంతో

యుత్సాహము కలదో అంతటియుత్సాహము అన్యనాగరికుల కును కలదని నాకు తెలియుచున్నది. ఇప్పుడు నేను స్వజన, పరిజనసంబంధమైన పక్షపాతమును చూపించజాలను. అందువలన గృహక్రమము ననుసరించి భిక్షాగ్రహణము చేయగలను.

నేను గృహక్రమము ననుసరించి భిక్షకొఱకు ముందుకు సాగుచుంటిని. కాని ఆప్రసాదమె నాకు కనిపించినది. అటు వైపునకు నాదృష్టి ప్రసరించకుండ నాపుకొనలేక పోతిని. ప్రాసాదముయొక్క గవాక్షముగుండ నాకు రాహులుని తల్లి కనిపించినది. ఓహో! ఎంత తేడా! ఎవరిని నేనర్ధనిశీథమున సుప్తావస్థలో త్యజించితినో యామె యొక రాజకుమారి. ఇప్పుడు నేనెవరిని చూచుచున్నానో ఆమె రాజకుమారి యయినప్పటికి నొక భిక్షుకివలె కన్పించుచున్నది.

నన్ను చూడగానే ఆమె లోపలికి వెళ్ళిపోయినది. బహుశా మహారాజున కీ సమాచారము నందించుటకై పోయెనేమో! మీకుమారుడు నేడు భిక్షుకుడైనాడని వ్యంగ్యముగా వారితో చెప్పియుండవచ్చును. ఎందుకనగా ఈఘటన జరిగిన కొన్ని నిముషముల కీశుద్ధోదన మహారాజు రాజభవనము నుదిగి నాయొద్దకు వచ్చెను.

మోహమున కెంతబలమున్నదె! శుద్ధోదన మహారాజు నన్నిప్పటికి తన పుత్రుడనియే భావించుచున్నాడు. అందువలననే భిక్షాటన మార్గమునందె నన్నాపి యిట్లనెను.

"పుత్రా! నన్నెందులకు సిగ్గుపాలు చేసెదవు. ఎందులకు భిక్ష నడుగుచున్నావు? నీకు, నీ శిష్యులకు నేను భోజనము పెట్టలేనా?"

"మహారాజా! మనవంశము యొక్క ఆచారమేయిది."

"బిడ్డా! మనవంశము ఒక గొప్ప క్షత్రియ వంశము. మనవంశములో నింతవఱకెప్పుడెవరును భిక్షనడిగి యెఱుగరు. భిక్షను మనమింతవఱకిచ్చితిమేగాని ఎన్నడును పుచ్చుకొనలేదు"

"మహారాజా! మీరేవంశమును గుఱించి ప్రసంగించు చున్నారో అది శరీర సంబంధమైన వంశము. కాని నేను ఆధ్యాత్మిక వంశమును గుఱించి మాట్లాడుచున్నాను. నేనిప్పుడు శాక్యవంశస్థుడనుగాను. నాది శ్రమణవంశము."

"బిడ్డా! భౌతికమైన భోజనముకొఱకు మనము భౌతిక వంశమును గుఱించియే మాట్లాడవలెనుగదా!"

"మహారాజా! ఎవరు భూతపోషణము (శరీర పోషణము) కొఱకై భోజనము చేయుచున్నారో వారు మాత్రమే భౌతికవంశమును గుఱించి మాట్లాడుదురు. ఎవరు ఆధ్యాత్మికసిద్ధికై భోజనమును తీసికొనుచున్నారో వారాధ్యాత్మిక వంశమును గురించి ఆలోచింతురు."

"మంచిది బిడ్డా! మంచిదె. కాని నీకుచితమనితోచిన విధమున నాచరించుము. కాని నేను జీవించియుండగా

నానగరమునందే మొదటిదినమే ఈ విధముగా భిక్ష నడుగ వలదు. నీభిక్షువుల నందఱిని తీసికొని రాజభవనమునకు నడువుము. అచటనే అందరు భోజనము చేయుదురు. సంవత్సరములనుండి దప్పికగొన్న నేత్రములకు దర్శనామృతమును త్రాగించుము."

ఈ విధముగా మహారాజుగారి అనురోధమువలన నేను రాజప్రాసాదమునకే వెళ్ళవలసివచ్చినది. శ్రమణునకు రాజునందు, దరిద్రునియందు సమభావ ముండును. అందువలననే గృహక్రమమునను సరించి నేను భిక్షను స్వీకరించితిని. సమభావము మంచిదైనను అంధ సమభావము (Blind Equality) మంచిదికాదు. సమభావము పేరుతో హటవాదముల నొనర్పరాదు. వ్యర్థముగా ప్రజల హృదయముల నొప్పించ కూడదు. మధ్యమార్గమే శ్రేష్ఠము. అతివాద మనుచితము. శ్రేష్ఠపురుషుల అనురోధమునకూడ కొంత మూల్యముండును. ఈ దృష్టివలననే నేను శుద్ధోదనుని అనురోధము నంగీకరించితిని. గౌతముడుబుద్ధుడనియు, హటముచేయువాడుకాదనియు, గీచిన గీటు దాటువాడుకాడనియు ప్రజలు తెలిసికొందురు గాక!

మరియొకమాట — అచ్చటకు నేనొక్కసారి వెళ్ళవలయునుగదా! ఈ పరిస్థితులవలన రాహులునితల్లి ఏవిధముగా మారిపోయినదో చూడవలయునుగదా! నేనామెకు మిక్కిలి అన్యాయముచేసితి ననుటలో నావంతయు సంశయము

లేదు. ఆమె జీవిత రసమును పిండి పిప్పిచేసెను. కాని ప్రపంచమున పాపమున్నంతవఱకు తెచ్చికొన్నకు లిట్టికష్టముల స్వయముగా ననుభవించుటయేగాక తమ సంబంధులకును నీ కష్టములను పంచిపెట్టక తప్పదు.

ఇక క్షత్రియాంగన యిటువంటి వైధవ్యమును భరించు టకెల్లప్పుడు సిద్ధమైయుండవలయును. నేను గృహము నందేయుండి రాజుగా రాజ్యకార్యములను నిర్వహించుచు యుద్ధమునకై వెడలి యొకప్పుడు దురదృష్టవశమున శత్రువుల చేతిలో పంచత్వము నొందుచో నప్పుడు రాహులుని తల్లి వైధవ్యబాధ ననుభవింపవలసియుండునుగదా! నిజమైనవీరుడు యుద్ధమునకు వెళ్ళడని చెప్పలేను. అన్యాయము కొఱకు యుద్ధము కొఱకు వెళ్ళకపోయిన న్యాయ సంరక్షణార్థము యుద్ధమే చేయవలసివచ్చుచో అందున పాల్గొనక తప్పదు. పాల్గొనినపక్షమున శత్రువులను చంపవచ్చును లేక శత్రువుల వలన చంపబడవచ్చును. ఇట్టి రాజస చికిత్సలో నొక వీర పత్నికి వైధవ్యప్రాప్తి అనుమానించగలిగినప్పుడు ఈ శ్రమణ మార్గమున తటస్థించు సాత్విక చికిత్సలోకూడ వైధవ్యప్రాప్తి ననుమానించుట ఆశ్చర్యముగాదుకదా! ఒక సామ్రాజ్యము కొఱకు సహస్రాదివీరుల ప్రాణములు బలి నివ్వవలసివచ్చును. వేలకొలది స్త్రీలు వైధవ్యము బొందుదురు. వేలకొలది చెల్లెండ్రకు సోదరులు దూరమగుదురు. వేలకొలది తల్లి దండ్రు లపుత్రకులగుదురు. వేలకొలది శిశువులు పితృ హీనులగుదురు. ఇంతటి వినాశనకరమైన యుద్ధమునకు

వెళ్లుచున్నటువంటి వీరులకు వీడ్కోలు విందులు చేయుదురు. వారికి హారములను సమర్పించుదురు. కాని ధర్మసామ్రాజ్య స్థాపనకు ప్రారంభమునుండి పాపమును, దుఃఖమును దూరము చేయుటకు యువకులు, మహార్థికులు గృహత్యాగము నొనర్చుటలో నాశ్చర్యమేమున్నది.

రాహులుని తల్లి బుద్ధిమంతురాలు, విద్వాంసురాలును గాన ఈ తత్వము నర్థముచేసికొనగలదు. లేనిచో నామెకు బోధించుట నా కర్తవ్యము. ఆమె ఎట్లున్నది, నా జీవితములో కలిగిన క్రాంతివలన నామె జీవిత మెట్లు మారినదో చూడవలయుననియే నా హృదయమునం దుత్సాహముగా నున్నది. ఆమె విషయమున నాకు మోహము లేనప్పటికి నామె జీవితమునందు కలిగిన పరిణామమును చూడవలయుననెడి నాయభిలాష నేడు పూర్తియైనది.

రాహులుని తల్లి యొక వీరపత్నియనియు, వీరమాతయనియు, వీరనారి యనియు తెలిసికొనుటకు నా కెంతో సంతోషముగా నున్నది నేను రాజభవనమున కరుదెంచినప్పు డందరు నాదర్శనమునకై వచ్చిరి. కాని ఆమె మాత్రము రాలేదు. భిక్షువు లందరితో కూడానే భోజనము చేసితిని. అందుకు వచ్చుటకును రాకపోయినను, చివరకు కనిపించుటకూడ దుర్లభమైనది. ఆమెకున్న ఈ ఆత్మగౌరవము సరియైనదే. ఆమెకు నిజముగా నపరాధముచేసినవాడను నేనే! విశేష పరిస్థితులనుబట్టి నా గృహత్యాగ

ముచితము, అవసరమని చెప్పినను ఈ ప్రకారముగా దొంగ వలె గృహమునువీడి పరుగిడిపోవు టుచితమని చెప్పజాలను. అది చాల అనవసరమని చెప్పగలము. అంతవరకే అది యుచిత మనికూడ చెప్పవచ్చును. కాని యది పూర్తిగా అపరాధమే.

ఆమెకున్న ఈ స్వాభిమాన ముచితమైనదేగాక యత్యావశ్యకమైనదికూడ దీనివలన నామె యింద్రియములను జయించినదనియు, బాహ్యముగా నాకు సహగామిని కాకపోయి నను, ఆంతరికముగా నాకు సహచారిణియనియే తెలియుచున్నది. ఆమెకు నామీద మోహము లేదు. ప్రేమమాత్రమున్నది. అందువలననే యిన్ని సంవత్సరములు గతించిన పిదప గృహ మునకేతెంచిన నన్ను చూచుటకైనా బయటకు రాలేదు. ఆమె ధైర్యము ప్రశంసనీయము. ఆమె మహత్వము కీర్త నీయము. నేను బుద్ధుడను, జినుడను, అర్హంతుడనైనప్పటికి నీ శరీరమును ధరించియున్నంతకాల మీశరీరసంబంధము లను సంపూర్ణముగా నుపేక్షించి యుదాసీనుడనై యుండ జాలను. గృహస్థ జీవితములో భర్తగా నేనన్యాయము చేసితిని. చెప్పకుండ దొంగతనముగా గృహమునుండి వెడలి పోతిని. ఈ యపరాధమునకు నామమాత్రమైనను ప్రాయ శ్చిత్తము చేసికొనుటవసరము. ఇదియేగాక ఒక గౌరవ శాలినియైన స్త్రీయొక్క గౌరవమును కాపాడుట నాధర్మము. అందుచే నేను రాహులుని తల్లికి దర్శన మిచ్చుటకు లేక ఆమె దర్శనము చేసికొనుట కంతఃపురమునకు వెళ్ళితిని.

అచ్చట శుద్ధోదనమహారాజు నెంటనుండుట మంచి దైనది. నా ముఖ్యశిష్యులైన సారిపుత్ర, మౌద్గల్యాయనులు గూడ నా వెంటనుండుట ఇంకను మంచిదైనది. "రాహులుని తల్లి నాతో నెటుల బ్రవర్తించినను ప్రవర్తించనిండు. మీరు మధ్యలో మాట్లాడవలదు" అని నేను మొదటనే నా శిష్యులకు బోధించితిని. ఆమె ప్రేమను చూపినను, లేక ద్వేషమును జూపినను ఈ రెండుపరిస్థితుల నెదుర్కొనుటకు నిశ్చయించుకొనియె నెళ్ళితిని. కాని ఆ దేవి ఎంతయో ధన్యాత్మురాలు. ఆమె రాగమును ప్రకటించ లేదు. ద్వేషమును ప్రకటించ లేదు. ఆమె కేవలము శిరస్సును వంచి నాకు ప్రణమిల్లినది.

ఆమె నాకు ప్రతీకారముచేయునని మొదట నూహించితిని. నేనేవిధముగా నుపేక్షించి ఆమెను త్యజించితినో అదే విధముగా ఆమెయు నన్ను త్యజించినదని భావించితిని. ఆమె హృదయములో ప్రతీకార భావన కలిగినచో నెంతయో బాగుండెడిది. ఆమె యుపేక్షవలన నా పాపమునకు ప్రాయశ్చిత్తము కలిగి, నా మనోభారము కొంత తగ్గిపోయెడిది. కాని యిదే సమయమున మహారాజు నా ధర్మమునుదూర మొనర్చెను.

"భంతే నా బిడ్డ గుణవంతురాలు, తపస్విని, త్యాగశీల. పతిభక్తి పరాయణ. తన భర్త కాషాయవస్త్రములు ధరించిరన్న వార్త విన్నప్పటినుండియె ఈమె కాషాయ

వస్త్రములను ధరింపసాగినది. తన భర్త యొంటిపూట భోజనముచేయుచున్నాడని వార్త వినగనే తాను నొంటిపూట భోజనము చేయుచున్నది. తన భర్త మంచముమీద శయనించుటలేదని విన్నప్పటినుండి తానును మంచమును వదలినది. తన భర్త గంధమాల్యాదులను త్యజించెనని విని తానును వదలివేసినది. పుట్టింటివారనేకసారులు వచ్చి అన్నిరకములైన సేవా శుశ్రూషలు చేయుదుమని విన్నవించినను వారి మాటయందు కొంచెముగూడ ధ్యానముంచలేదు.''

మహారాజుగారి మాటలువిని నేను వణకిపోతిని. నాకు బుద్ధత్వము ప్రాప్తించినది గాన సరిపోయినది. లేనియెడల మహారాజుగారి మాటలనువిని యేడ్వవలసి వచ్చెడిది.

నేను రాహులుని తల్లి నధికముగా ప్రశంసించితిని. అనేకోపదేశముల నిచ్చి తిరిగి వచ్చితిని. బహుశా ఆమె యొక్క పతిభక్తి త్యాగము, తపస్సుయొక్క తేజమును ఎక్కువ సమయమువరకు సహింపలేనేమో!

నారీ! నీబంధము లెంతకోమలములో యంత బలవత్తరములు. వాటిని తెంచుట సులభమా. ఆరాత్రి నేను దొంగతనముగా గృహత్యాగము చేయనిచో నీ కోమల బంధనముల వదలించుకొని గృహనిష్క్రమణము చేయగలవాడనా? అస్వాభావికముగా నిష్ఠురుడను కావలసె వచ్చెడిదిగదా! కాని ఆదినము నిష్ఠురత్వమున కాధారమేమియు లేదుకదా!

నేనెందుకు గృహత్యాగము చేయుచుంటినో నాకే తెలిసినది కాదు. ఈవిధముగా నొకవైపు నిష్ఠురత్వమునకు కారణము లేక పోగా రెండవవైపు భార్యనుగురించిన కర్తవ్యము, నామెమీద వైధవ్యమనే పిడుగును వేయుచుంటినను భయము నా కుండెడిది. ఆపరిస్థితులలో నిష్ఠురత్వము మానవత్వములో నొకభాగమగునా? అదిమనుష్యత్వమున కంగమైనట్లు తెలిసి కొనగలను. ఒకవేళ నాకు తెలిసినను దేవికెట్లు తెలుపగలను. వీరాంగనలు మృత్యు ముఖమున ప్రవేశించు తమపతులకు వీడ్కోళ్ళు చెప్పుచుందురు. కాని వారిఎదుట యుద్ధమో, విజయమో రాష్ట్ర సంరక్షణమో మొదలైన కర్తవ్యములు స్పష్టముగా గోచరించును. కాని నాయెదుట ఏముండినది? నాయెదుటనున్న ధ్యేయము నస్పష్టముగా కనబడుచుండెను. ఆధ్యేయమును జేరుమార్గ మెటో తెలిసినదిగాదు. అట్టిపక్షమున ధ్యేయము నేమార్గమునుచూపి రాహులుని తల్లితో సెలవు తీసికొనగలను. అట్టిఅనిర్దిష్టపథవిహారము నాధారముగాగొని ప్రేమబంధనము నెట్లు త్రెంచగలిగెడివాడను. నేడు నాకులభించిన బుద్ధత్వముయొక్క జాడయైన నాదినము కనిపించలేదే. ఇక రాహులుని తల్లికి నేనేవిధముగా సమాధానము చెప్పెడివాడను.

పురుషుడు స్త్రీని కైదుచేయుటకు ప్రయత్నించెను. కాని స్త్రీ తన అసాధారణయోగ్యతవలన కైదును స్వర్గముగా మార్చి పురుషుని గూడ కైదులో వేసెను. పురుషుడు శక్తిని ప్రదర్శించెను. కాని స్త్రీ ప్రేమ, సహానుభూతులచే

శక్తిని ఓడించి పురుషుని తనలో మేళవించుకొనెను.

రాహులుని తల్లియందున్న ఈ పరిపంథశక్తియొక్క పరిచయము నేడే నాకు గలిగినది. సుదూరమునందుండియు రాహులునితల్లి నన్ను తన కైదులో వేసికొనినది. నేనామెను పోగొట్టుకొంటిని. కాని ఆమె నన్ను పొందినది. నాయందున్న ఈపరిపంథ సాత్వికశక్తికి పురుషుడు శతశతప్రణామములొనర్చవలయును.

పాపాత్ములైన మారుడు నేడున్నంత దుర్దాంతముగా మరెప్పుడును లేడు. మారుడొక విపత్తిగామారి వచ్చినప్పుడు నొక కర్మఠవ్యక్తి అతనిని జయించగలడు. కాని అతడే ప్రలోభనముగామారి వచ్చినప్పుడతనిని జయించుటతి దుష్కరమైనను సాధుపుమాత్రమాతనిని సునాయాసముగా జయించగలడు. కాని ఆ పాపియైన మన్మథుడే ప్రేమగాను, లేక కర్తవ్యముగాను రూపెత్తి యొక మహా .కర్తవ్యమార్గమునకు నడ్డు నిలిచినప్పుడతనిని జయించుట బుద్ధునకైనను, జినునకైననుగూడ అతి కఠినము. చివరకు బుద్ధునకు లేక జినునకు విజయము లభించినను, ఈ విజయసాధనలో బుద్ధుడైనను, జినుడైనను, అర్హాతుడైనను . తన సంపూర్ణశక్తిని వ్యయముచేయవలసియుండును. నేడు నా శక్తికిని ఆదేపరిక్ష జరిగినది.

---

## 12. యుపకులైన సాధువులయొక్క ఆవశ్యకత.

రాజనీతి సామ్రాజ్యమునకంటె ధార్మిక సామ్రాజ్య స్థాపనమే మిక్కిలి కష్టము. రాజనీతి సామ్రాజ్యస్థాపనకు పశువులు, ఇంకను నరపశువులుగూడ నుపయోగపడును. దండబలముతో వారిని పనిచేయించవచ్చును. కాని ధర్మ సామ్రాజ్యమునకు వీరుపయోగపడరు. ఉన్నతశ్రేణికి చెందిన సైనికులే దీనికి కావలెను. వారు సంఖ్యలో పరిమిత మైనను ఫరవాలేదు. బుభుక్షా పీడితులైనవారు భిక్షుకులై స్థాపించిన ధర్మసామ్రాజ్యము కొన్ని గంటలలోనే క్షీణించి పోవును. నాకీనాడు లభించిన ధార్మిక విజయమునకు ఎన్నో కారణములున్నవి. అందులో ముఖ్యకారణము నేను రాజ వైభవమును, సౌందర్యరాశియగు పత్నిని గొప్ప రాజవంశ మును త్యజించితినని ప్రజలు గుర్తించుటయే. ఏ సత్యముకొఱకై నేనింత త్యాగముచేసితినో, ఆ సత్యము సర్వోత్తమమను భావనమే ప్రజలలో లేకపోయినచో, నా కార్యము సగమేకాదు, నాల్గవ భాగముగూడ పూర్తికాక పోయెడిది. సత్యపరీక్షకు ప్రజలుపయోగించు గీటురాయి మిక్కిలి పనికిమాలినదిగా నున్నది. ప్రజల నావరించిన ఈ మూఢ్యవ్యాధి ఎప్పుడు నశించునో తెలియరాకున్నది. ప్రజలు వస్తువును పరీక్షించక, వస్తువు నుంచిన పాత్రను మాత్రమే పరీక్షచేయుచున్నారు. స్వర్ణపాత్రయందుంచిన విషము నైనను వారు త్రాగుదురు. మృణ్మయపాత్రయందుంచిన

అమృతమునైన నసహ్యించుకొందురు. పుష్పావృతమైన విష్ఠనైనను పూజింతురు. పుష్పాలంకారముచేయని దేవతనైనను తిరస్కరింతురు. వారికున్న ఈ మూర్ఖత్వము నిజముగ శోచనీయము.

చింతించినందున ప్రయోజనమేమి? రోగికున్న మూర్ఖత్వమునకు వైద్యుడు చింతించుచునే యున్నచో, రోగికృశించి పంచత్వము నొందును. ఇక వైద్యుడెందులకు? ప్రజలమూర్ఖత్వమునుజూచి నేనును చింతించుచు నుండినచో, ప్రజలు నశించుదురు. నేను తీర్థంకరుడను కాబోను. కాన నా సాధుసేవలో నెక్కువగ సంపన్న గృహమునుండియే యువకులు రావలెనని తలంచుచున్నాను వృద్ధులు, బీదలు, సాధుసేవలో చేరుటకు ఏవిధమైన నిర్బంధములేదు, కాని ధనికగృహములనుండి వచ్చిన యువకసాధువులు ధార్మిక సామ్రాజ్యస్థాపనకెంతగ నుపయోగింతురో అంతగ వృద్ధులు, బీదలునైనసాధువు లుపయోగింపరు.

వృద్ధులలో ఉత్సాహ ముడిగిపోవును. క్రాంతిభావనయే జనించదు. వారు శాంతము, పవిత్రమునైన జీవితమునే గడుప గలుగుదురుగాని తీర్థస్థాపన కుపయోగపడ జాలరు. "ఎంతో జీవితము గడచిపోయినది. ఇకమిగిలిన జీవితము చాల స్వల్పము. ఈ స్వల్ప జీవితముకొరకై శ్రమపడనేల" యని వారి ఆలోచన. కాని యువకులతో పోటీ చేయగలిగినట్టియు, వృద్ధులలో యువకులుగ పనిచేయుచు వృద్ధత్వమునందు కూడ క్రాంతిజ్యోతిని వెలిగించ గలిగిన వృద్ధులు చాలనరుదు.

దరిద్రుని త్యాగము పరీక్షనివ్వని విద్యార్థి జ్ఞానముతో పోల్చవచ్చును. పరీక్షనివ్వకపోయినను మనుష్యుడు పండితుడు కావచ్చును. కాని అతని పాండిత్యము 'ఇంత - అంత' యని చెప్పజాలము. అట్లే దరిద్రులుకూడ ప్రలోభనముల నెంత వరకు జయింపగలుగుదురో చెప్పజాలము. బుభుక్షాపీడితు డొకడు నేను సాధుసంఘలో జేరినను రేపు ఏవిధమైన ప్రలోభ నము లభించినను, వైభవము లభించినను నతడు వాటికి దాసుడైపోగలడు. కాని శ్రీమంతుడుగనుండి సాధు వయిన వా డిట్లాలోచించును— "ఈ భోగములే నా కవసర మగుచో నేను సాధువృత్తి నెందుకు స్వీకరించవలయును. నా గృహములో నా కేమి తక్కువ". ఈ విధముగ నాత్మ విమర్శన చేసికొను సాధువులు ధర్మప్రచారమున కెక్కువగ నుపయోగపడుదురు.

యువకులు, శ్రీమంతులు సమాజమునం దధికోత్సాహమును పెంపొందింతురు. వృద్ధులు సాధు సంఘములో ప్రవేశించినపుడు ప్రజ లిట్లు విమర్శింతురు — "ఓహో! ముసలివాడు; ప్రపంచములో నేపనియు జేయజాలడు; అందుచే సాధువృత్తిని స్వీకరించెను. బీదలు సాధువేషము ధరించి నపుడు — ఓహో! వీడు దరిద్రుడు. ఇంటిలో తినుటకు లేక, సంపాదించలేక సాధు వయ్యెననియు ప్రజలు విమర్శింతురు. వృద్ధుడుకూడ నిజమైన సాధువు, పవిత్రిమాభిలాషి కాగలడు. దరిద్రుడుకూడ విశ్వసనీయుడు, ప్రలోభవిజయి, సత్సాధువు కాగలడు. అందువలననే వృద్ధులను, దరిద్రులనుకూడ సాధు

సంఘములో జేర్చుకొన దలచితిని. కాని అందులో వైభవములను, విలాసములను త్యజించిన యువకుల నత్యాధికముగ చేర్చుట భిక్షు సంఘమున కెంతగానో దోహద మిచ్చును. సంఘమునకున్న ఈ మహాత్వమువలన దాని సేవాసక్తి అభివృద్ధిజెందును. మహాత్వ ప్రభావము ప్రజలకు గలిగించినంతటి యుత్సాహము కేవల సత్యము కలిగించ జాలదు. మహాత్వ ప్రభావమును హర్షించుట ప్రజలకున్న మూర్ఖత్వమునకు చిహ్నము. అది వారిలోనున్న లోపము. కాని వారు మూర్ఖులుగా నున్నంతకాలము వారి సరణినే నే ననుసరించ వలయును. ఈ మూర్ఖత్వమును రూపు మాపుటకై ప్రజలయొద్దకు పోవుట నాకు తప్పనిసరి. అంత వరకీ మహాత్వ ప్రభావము నుంచవలయును.

ఇందువలన నే నొకే వారములో సత్యవేదికమీద నాకు సంబంధించిన రెండు కుటుంబములను బలిచేయ వలసి వచ్చినది. దిగ్విజయమును సాధించదలచిన చక్రవర్తి కుటిల నీతి ననుసరించునట్లు నేనును కుటిలనీతి ననుసరించవలసి వచ్చినది. ఆయువుపట్టున దెబ్బకొట్టితిని. ఈ సఫలత్వమును జూచి నేను నవ్వనుగలను, ఏడ్వనుగలను.

మొన్నటి దినము భిక్షార్థము రాజభవనమునకు వెళ్ళితిని. అచ్చట నందకుమారుని జూచినప్పుడు నందుడు ప్రవ్రజితుడైనచో భిక్షుసంఘమహాత్వ మభివృద్ధి జెందునని తలంచితిని. సంఘమునకు నిజమైన సేవకుడు లభించునని

ఊహించితిని. నందుడు సంకోచముకల యువకుడు. సంకోచమునకు లొంగి భిక్షుదీక్ష నతడు తీసికొన్నచో నభిమానము వలన దీక్షను శాశ్వతముగా నిర్వర్తించగలడు. ఇట్లాలోచించియే నాకమండలము నందునిచేతి కందించితిని. బుద్ధభగవానుడు కమండలమునుతీసికొని నన్ను తిరిగి గృహమున కంపెదనని నందుడు తలంచుచుండవచ్చును. కాని నేనతనిని తిరిగి పొమ్మని చెప్పలేదు.

నాతోపాటు నందుడు ప్రాసాదమునుండి బహిర్గతమై వచ్చుచుండగా నొకదాసిచూచి యిట్లనియెను- ఆర్యా, ఆర్యా చూడుడు, కుమారులు భగవానునితో వెళ్ళుచున్నారు. వారు కుమారుని తనవెంట శాశ్వతముగా నుంచుకొనెదరు. "ఆర్యపుత్రా! శీఘ్రముగా నరుదెండని గవాక్షమునుండి చూచుచున్న నందునిపత్ని దీనముగా పలికెను. అయినప్పటికి నాహృదయమును పాషాణముగ నొనర్చుకొని నందుని లాగుకొనియే వచ్చితిని. నందుడు విహారము చేరినతరువాత నేనిట్లంటిని.

"నందుడా! నీవు గొప్ప శక్తిశాలివి"
"అదెట్లు? భంతే"

"బుద్ధుని కమండలమును రాజ భవనమునుండి విహారమువరకు తీసికొని రాగలిగితివి. ఇంతదూరము బుద్ధుని కమండలమును తీసికొని రాగలిగినశక్తి శ్రమణునికితప్ప మరెవ్వరికి నుండజాలదు." (దీనికి నందుడు మౌనముగా నుండెను)

"నందుడా! ఏ మాలోచించుచున్నావు. ఆశక్తిని సద్వినియోగపరచెదవా! లేక వ్యర్థముగా పోనిచ్చెదవా!

"భంతే! ఆశక్తి నుపయోగపరచెదను."

"అట్లగుచో నీవు ప్రవ్రజితుడవు కావలయును. దానికి నీవు సిద్ధముగా నున్నావా?"

నందుడు కొంత ఆలోచనలోపడి చివరకు సిద్ధముగా నున్నానని జవాబు నొసంగెను. ఈ విధముగా నందుడు ప్రవ్రజితుడుగా జేయబడెను. నందుడు వివాహితుడనియు, నతడు భిక్షుసంఘమున జేరినందువలన నతని పత్నికి కొంత యన్యాయము కలుగుననియు నాకు తెలియును. కాని విశ్వకల్యాణమునకై వ్యక్తి తన వ్యక్తిగత సుఖములను త్యజించుట కొంత యవసరము. రాహులుని దీక్షగూడ నేడు విచిత్రము గానే జరిగినది. నేడు రాజభవనమునకు భిక్షార్థము వెళ్ళితిని. "నీవు మీ తండ్రిని పిత్రుసంపత్తి నడుగుమని చెప్పి రాహులుని తల్లి కుమారుని నాయొద్దకు పంపెను.

"భంతే! తమరు నాకు పితృదేవతలు. పితృదేవతల నుండి నాకు పైత్రుక సంపత్తి (వారసత్వము) లభించవలయును."

"నీవు నీ తండ్రియొక్క వారసత్వమును గ్రహించగలవా?"

"స్వీకరించగలను, భంతే."

"తమరు నిర్వహించగలవా?"

"నిర్వహించగలను భంతే!"

"మంచిది. నిర్వహించుము. నా వారసత్వము శ్రామణ ప్రవ్రజ్యయే. అనగా భిక్షుదీక్ష నిచ్చుటయే. నీవు కూడ దానిని స్వీకరించుము. సారిపుత్రా! రాహులుని ప్రవ్రజితునిగా జేయుము."

ఈవిధముగా రాహులునిగూడ నపహరించితిని. అతని జీవితమును విశ్వకల్యాణమను యజ్ఞమునం దాహుతిగా నిచ్చితిని.

విశ్వకల్యాణముకొఱకు నేను స్వయంసేవక సేనను తయారుచేయదలచితిని. అందు క్షత్రివారి నపహరించుట తప్పనిసరియైనది. కాని యిది ప్రారంభములో నపవాద స్వరూపములుగా మాత్రమే యుండెను. ఇప్పుడీ అపవాదములను (Exceptions) తుదముట్టించదలచితిని.

సాయంకాలము శుద్ధోదన మహారాజుగారు నా విహారమున కరుదెంచి, "భంతే, నేను మిమ్ములను వరమడుగ దలచితినని" పలికిరి.

"మహారాజా! ఒక భిక్షువు లోకమహారాజున కేమి వరము నివ్వగలడు."

"భంతే! నీ కుచితమును, శక్యమును నైన వరమునే అడుగగలను."

"మంచిది. అట్లగుచో నడుగుము."

"మీరు ప్రవ్రజితులైనప్పుడు నాకు దుఃఖము కలిగినది. నందుని ప్రవ్రజితునిగా జేసినప్పు డంతకంటెను మిక్కిలి దుఃఖము కలిగినది. ఇప్పుడు రాహులుని ప్రవ్రజితునిగా జేసినందున నా హృదయము శత సహస్ర ఖండ ఖండములైనది భంతే! పుత్రప్రేమ నా శరీరమును కోయుచున్నది. అంతటితో నాగక మాంసమును ముక్కలుగా జేయుచున్నది. మాంసముతో నాగక నరములను కోయుచున్నది. నరములను కోసిన మీదట నెముకలను ముక్కలు చేయుచున్నది. తమరు తల్లిదండ్రుల అనుమతి లేకుండ పిల్లలకు భిక్షుక దీక్ష నివ్వకున్నచో ఎంతో మంచిది."

"మహారాజా! నేనీవిషయము నాపుచేయ దలచుచున్నాను. అయినను కొంతకాలము మాత్రమే నే నీ పనిని సాగించదలచితిని. ఇట్టి శ్రేష్ఠ బలిదానము సమాజమున జరుగనంతవరకు విశ్వకల్యాణమునకుగాని లేక సమాజ సేవకు గాని మార్గమే కనిపించదు."

"భంతే! తమరీవిధముగా నింట్లకు నింట్లనే ఖాళీచేయుచున్నచో తమరి నెవరాదరించగలరు. అందరు తమనుజూచి భయపడుదురు. భయంకరులుగామారినవారు చక్రవర్తిగాగాగలరు. కాని తీర్థంకరులో లేక జనసేవకులు కాజాలరు.

భంతే! మీ దర్శనము ప్రజల కాహ్లాదముగా నుండునట్లు ప్రవర్తింప కుంటే మంచిది. తమ పతులనో, లేక పుత్రులనో కోల్పోవుదమను భయముతో స్త్రీలు తమను చూచి వణకుచున్నారు. తమ తండ్రులను మీ రపహరింపుదురను శంకతో బాలు రేడ్చుచుందురు. యువకులైన పుత్రులను తమకు భిక్షుకులుగా మార్చుదురను భయముతో వృద్ధులు విలపిల్లుదురు. ఇట్టి భయోత్పాదకమైన వాతావరణమందు మీ రేమి సేవ చేయగలరు. తమ తీర్థము లోకప్రియ మెట్లుగాగలదు?"

"మహారాజా! మనము ప్రాసాదము నెంత గొప్పదిగా నిర్మించదలచుదుమో దానికి పునాది నంతలోతుగ వేయుదుము. ధ్యేయ మెంత ఊర్ధ్వముగనుండునో ప్రారబ్ధ కార్య మంత నిమ్నముగ నుండును. ఇదే విధముగ లోక హితకార్యమునందును మొదట లోక విరోధమును సహించవలసియుండును. అందులకు క్రాంతికారియైన బుద్ధుడు భయపడడు. గుణాదికార్యమైనమీదట కార్యముయొక్క దిశ మారునట్లుగ క్రాంతికారికిని జనక్షోభ కార్యము పూర్తియైన మీదట జనహితమువైపు నతని కార్యదిశ మరలును. ఆ కార్యము యొక్క దిశకూడ మారనున్నది. ప్రారబ్ధ కార్యము సమాప్తినొందుటయే దానికి కారణము. ప్రశంసనీయమైనటువంటియు, ఆకర్షణీయమైనటువంటియు కార్యమును పూర్తిచేయదలచినప్పుడు లోకవిరోధమునకు, ప్రజలయొక్క కువిమర్శలకు మనము భయపడరాదనియు, తొట్రుపాటు

జెందరాదనియు మీరును, సమాజమును గుర్తించుకొనవల యును.

"భంతే! దీని భావమేమి?"

"ఈరోజు నాభిక్షు సంఘమును ప్రజలు ప్రశంసించు చున్నారు. నా మాటలు ప్రజలు ధ్యానముతో విను చున్నారు. నాకు, నా సంఘమునకు సౌకర్యములను, సన్మానములను జేయుచున్నారు. మేము బోధించు ధర్మము లను ప్రజలు యథాశక్తి తమ జీవితములలో నాచరించుటకు ప్రయత్నించుచున్నారు. అనేక శ్రీమంతులు తమ వైభవము లను, భోగవిలాసములను తుచ్ఛముగా భావించి నా భిక్షు సంఘమున జేరుటయే ప్రజలలో కలిగిన నీ మార్పునకు కార ణము. నా భిక్షు సంఘమందున్న శ్రీమంతులనుజూచి ప్రజ లిట్లాలోచింతురు:— ఈసంఘమందు మహత్వము, కల్యాణ కారకశక్తి లేనిచో ప్రజ లీవిధముగా ధన వైభవములను, యౌవనానందములను త్యజించి భిక్షువు లెందుకయ్యెదరు? మహారాజా! ప్రజలయొక్క ఈ మాటలు సరియైనవేనా."

"అవును. భంతే! ఇవి సరియైనవే."

"అట్లగుచో మహారాజా! నాసంఘమునందు శ్రీమంతు లైనయువకు లెచ్చటనుండి చేరుదురో సెలవీయుము. వారాకా శమునుండి దిగిరారుగదా! శ్రీమంతులైన యువకులుచేరిన సంఘమే యుత్తమమైనదని ప్రపంచము తలంచుచున్నది. నీబోటి లక్ష్మీపుత్రులును దానినే భిక్షుసంఘ పరీక్షకు

నొరపిడీరాయినిగా తీసికొనుచున్నారు. అట్టి పక్షమున భిక్షుసంఘమునందుండదగిన ఈ విశేష గుణముకొఱకు శ్రీమంతుల గృహమునుండి సామగ్రిని నేను సంగ్రహించ బోగా వారే క్షుబ్ధు లగుచున్నారు. ప్రపంచమునకు మిగిమీరిన స్వార్థమున్నది. తనకు గావలసిన ఆనందముయొక్క భారము నది యెల్లప్పుడు నితరుల తలమీదనే రుద్దుచున్నది. ఇట్టి ప్రవృత్తివాడు తలంచినచో నెవరికి లాభముగలదు? కాన, నే యభిలాషనైన మనము వ్యక్తముచేయుకొనుటయే యుచితము. లేక మన కొకవస్తువు తప్పనిసరిగ గావలయునని భావించినచో తత్సిద్ధికై మనముసంపూర్ణ సహకారమును చూపవలయును!"

"కాని, భంతే! అట్టి యభిలాష నెవరు వ్యక్తము జేయగలరు? ఎవరైనను నీతో చెప్పిరా?"

"మహారాజా! అది నోటితో అడుగు కోరికకాదు. అది వారి వ్యవహారమువలననే తెలియబడును. మన మాదరించు వస్తువునందు, పూజించు విషయమునందు, మన ప్రశంసలకు పాత్రమైన వస్తువులందు మన కభిలాష సంపూర్ణముగా నున్నదిగదా! భిక్షుసంఘమును పరీక్షించుటలో ప్రజల కేది యొరపిడీరాయిగా నున్నదో, ఏ భిక్షు సంఘమునందున్న నే విశేషమునుజూచి ప్రజలు నా సత్యమును గ్రహించనున్నారో యా విషయములను సంఘమునందు తీసికొని రాదలచితిని. ప్రజలు తమ దృష్టిని సవరించుకొని సత్యమును తమ వివేక బుద్ధితో తెలిసికొనుటకు ప్రయత్నించినప్పుడు, సత్యపరీక్షకు ధనము, వైభవము సిద్ధులు, గీటురాళ్ళు కానిచో నేను భిక్షు

సంఘమునందు కర్తవ్యదృష్టితో మానవులను జేర్చగలను. అట్టి పక్షమున శ్రీమంతులు మొదలైనవారిని గురించి విచారించవలసిన పనిలేదు. నవ వివాహితలైన వధువులు పతిహీనులై వియోగబాధ ననుభవించవలయునని నాకేమాత్రము కోరిక లేదు. కాని నేనేమిచేయఁగలను? ప్రజలే నన్నట్లు చేయుచున్నారు. మానవులకున్న యనుచితమైన యీ యభిలాషలే ధర్మసంస్థలలో పాప బీజములను నాటును. వాటిని (ధర్మ సంస్థలను) దంభమునకు, అంధవిశ్వాసమునకు, భౌతిక వైభవమునకు, కేంద్రములుగా మార్చును. బీజమును నా భిక్షుసంఘమునుండి దూరముచేయఁగలను. కాని ప్రారంభమునందు ప్రజానురోధమువలననే యుంచుట కొంచె మావశ్యకమైనది."

"భంతే! మీరు చెప్పినదంతయు సత్యమే. నా పొరపాటును నేను గ్రహించితిని."

"మహారాజా! ఇది మీయొక్కరియందున్న పొరపాటు మాత్రమే కాదు. ఇది ప్రజలకున్న సామాన్యమైన జబ్బు. ప్రజ లీ జబ్బును తప్పక చికిత్సచేసికొనవలయును."

"భంతే! మిమ్ములను దూరముచేసికొనియే నేను నా జబ్బుకు ప్రాయశ్చిత్తము చేసికొంటిని. వందలకొలది రాజకుమారులకంటె మీరు చాల గొప్పవారను విషయము నేడు నేనేకాక సమస్త లోకము గుర్తించుచున్నది. ప్రాయశ్చిత్త రూపముగా తమవంటి యమూల్య నిధిని పోగొట్టుకొని కూడ నేను నందుని, రాహులునికూడ దూరముచేసికొను

దౌర్భాగ్య మెంతయు పట్టుచున్నది."

"మహారాజా! నా సమస్త జీవితమును ప్రజలుచూచి సంతృప్తిపడునట్టుగ నా యమూల్యనిధియొక్క పరీక్ష పూర్తి కాదు. నోటితో నేనొక యమూల్యనిధినని ప్రజలు చెప్పుచున్నను, నాకు వారు పక్షపాతదోషము నారోపించగలరు. "గౌతమశ్రమణుడు పరగృహములను పాడుజేయుచున్నాడేకాని తన గృహములో నెవరికి భిక్షుదీక్ష నిచ్చుటలేదు. అత డెంత పక్షపాతియో చూడు" డని ప్రజలు నుడివెదరు. అందుకని మా వంశమునందున్న రాజకుమారుడైన నందుని భిక్షుసంఘమునందు జేర్చితిని. కాని ప్రజల విమర్శనదృష్టి చాల తీక్ష్ణముగాను, విషపూరితముగాను నుండునని నాకు దెలియును. నందుడు భిక్షుసంఘములో జేరినప్పటికి ప్రజలు విమర్శింపక మానరు. "శ్రమణ గౌతముడు నందునికి దీక్షనిచ్చెనేగాని తన కుమారునికిమాత్రి మీయనే లేదు. గౌతముడు గృహత్యాగియయినను తన వంశ సంరక్షణార్థము తన స్వంత పుత్రునికి దీక్షనీయక వదలివేసి తన కులాభిమానము నింకను జూపుచున్నాడని లోకులు వ్రేలెత్తి చూపించగలరు. మహారాజా! నింద యబద్ధమైనను,నిజమైనను సలిలమందుబడిన తైల బిందువువలె శీఘ్రముగా వ్యాపించును. ఆ నింద నా యమూల్య నిధిని కడిగివేయును. నేడు ప్రజలు బాహ్యమున కే నన్ను నిందించుచున్నారు. నందునికి, రాహులునికి భిక్షుదీక్ష నిచ్చి సంఘమున చేర్చనిచో నింతకంటె పదిరెట్లెక్కువగా తమ హృదయములలోనైనా నిందించెదివారు. మానవుడు

మహాత్మునియొక్క హృదయమును జదువజాలరు. మహాత్ముడు బాహ్యముగా నొనరించు కార్యములను జూచి కల్పించుకొని పోట్లాడుచుందురు. ప్రజలకు స్వార్థములేని విషయములలో నెవరియొక్క మంచితనమునైనను వారు స్వీకరింతురు. ఇతరులయందున్న తప్పులను వెతకి వెతకి వేసారి చివరకు దోషాన్వేషణ మానుకొందురు.''

''భంతే! మీరు చెప్పినదంతయు నిజమే. నేను నాగృహము శూన్య మగుటకు మీరుదోషులుగారు. దోషులు ప్రజలు. లేని యెడల ప్రజలకున్న మూర్ఖత్వము. ఇంతవరకు నేను తమను గురించి నిష్ఠురోక్తు లాడితిని. అందుకు నాకు చాల దుఃఖముగ నున్నది. నానిష్ఠురోక్తుల నే నుపసంహరించుకొనుచున్నాను. మీ కుచితమైనట్లుగా జేయుడు".

''మహారాజా! తల్లిదండ్రులు మొదలైనవారియొక్క యనుజ్ఞను తీసికొనని సంతవజ కెవ్వరికి ప్రవ్రజ్య (భిక్షుదీక్ష) నివ్వనని నియమము మాత్రి నేర్పరచ దలచితిని. నియమమును త్వరలో పూర్తిగా చేయుదును. మీరు చెప్పకున్న నీ నియమము కొద్దిరోజులైనమీదట దప్పక చేసెడివాడను"

మహారాజుగారు విహారమునుండి వెళ్ళినమీదట నే నీ నియమమును దయారు చేసితిని. ఇది యెంతయో మంచిదైనది. రోగికి వమనమగున ట్లౌషధమునివ్వరాదు. ఇట్టి నియమమును శీఘ్రముగా నేను ప్రవేశపెట్టనిచో సమాజమను రోగి విసుగు జెంది నా సదౌషధము నెప్పుడో వమనము జేసియుండును.

# 13. కుల జాతి గర్వమునకు గొడ్డలిపెట్టు.

స్వయంసేవకుల సైన్యము పర్యాప్తసంఖ్యలో పెరుగు చున్నది. భిక్షుసంఘమునందు శాక్య కుమారులు గుంపులు గుంపులుగా జేరుచున్నారు. భిక్షుసంఘ మభివృద్ధిజెందు కొలది నాకు బాధ్యతాభారము లధికమగుచున్నవి. సంఘము నకు నిజమైన త్యాగులు చాల అవసరము. వారికి హృదయము లం దహంకారముగాని, అవినయముగాని, లోభ లాలసత్వ ములుగాని మచ్చుకైన నుండరాదు. ఈ దుర్గుణములు భిక్షు కులకు మొదట వాడిపోయినట్లుగా కనబడును. కాని, కొంత సమయముననే మరల నాటుకొన నారంభించును. ఒక మొక్క నొకస్థలమునుండి పెకలించి మరియొక స్థలమున నాటునప్పుడు మొదట నది వాడిపోయినను కొన్ని దినములలో మొదటివలె అచ్చటను నాటుకొన నారంభించును. దుర్గుణ రూపము లైన విషవృక్షముల పరిస్థితియు నిట్లే. అవి గృహస్థుని హృదయమునుండి తొలగి శ్రమణుని హృదయమునందు జేరు నప్పుడు మొదట నవి వాడిపోయినను తదుపరి పచ్చబడ నారం భించును. దరిద్రులు, దీనులైనవారు భిక్షుసంఘమునందుజేరి నప్పుడు వారికి తమ పూర్వ జీవనముకంటె నీ సాధు జీవ నమునందు మిక్కిలి విశ్రాంతి లభించును. అందుచే నీ జీవ నమునందే వారు తన్మయులగుదురు. శ్రీమంతులు లేక విద్వాంసులు భిక్షుసంఘమునజేరినప్పుడు తమ త్యాగమునకు ప్రతిఫలము నహంకారారాధనద్వారా పూర్తిజేయ ప్రియ

త్నించుదురు. ఆదరమునకు, యశస్సునకు, కీర్తి, ప్రతిష్ఠలకు, అహమహమిక చూపుచుందురు. నేను నాచరణ వందనమును జేయువారే రేపు నా ఆదాయమునందు హక్కును స్థాపించు కొనుట కొఱకై తమ యౌవనశక్తిని వినియోగింతురు. ఇది అన్యాయము. సంఘమునందు సాధుత్వము లోపించుట, భిక్షువు లల్లకల్లోలమగుట దీనిఫలితము. ఈ శ్రీమంతులవలన, కులీనులవలన రేపు చిక్కులే సంభవించును.

మొన్నటిదినము శాక్యరాజులయిన భద్రిక, అనురుద్ధులు, శాక్యయువకులైన ఆనంద, భృగు, కింబిల, దేవదత్తాదులు భిక్షుదీక్షకై నావద్ద కరుదెంచినప్పుడు నాకు ఈ పైవిచారములే తోచినవి. అందువలన నేను వీరిని పరీక్షించదలచితిని. వారితోపాటు వారిసేవకుడైన ఉపాలి నామధేయుడైన మంగలి కూడ నుండెను. అతడు వారికంటే వయస్సులో నధికు డగుటయేగాక బుద్ధిమంతుడుగూడ. అతనిని జ్యేష్ఠునిగా జేయ వలయునను తలంపుతో నేను వారి నిట్లు ప్రశ్నించితిని.

"శాక్యపుత్రులారా! మీలో నెవరికి ముందు దీక్ష నీయవలయును."

"శ్రీవారి యిష్టానుసారమే."

"ప్రథమ దీక్షితునకు కలుగు లాభములు మీకు తెలియునా?"

"భంతే! మాకు తెలియదు."

"చూడుడు. శ్రమణుల నియమము ననుసరించి ప్రథమ దీక్షితుడు వయస్సులో చిన్నవాడైనను పెద్దవాడైనను పశ్చాద్దీక్షిత శ్రమణులకంటె జ్యేష్ఠుడుగా వ్యవహరింపబడును. గృహస్థాశ్రమమున కనిష్ఠ సోదరులు జ్యేష్ఠసోదరుని గౌరవించి నట్లుగ భిక్షుసంఘమున పశ్చాద్దీక్షితులు ప్రథమ దీక్షితు నాదరించి సత్కరించవలసియుండును. మీలో ప్రథమ దీక్షితులైనవారి నాదరించుట, సత్కరించుట తక్కినవారి పరమ కర్తవ్యము. కాన నెవరికి ముందు దీక్ష నీయవలయునో మీరే చెప్పుడు."

"మీ దృష్టిలో యోగ్యులైనవారి కిండు."

"మీకు జాతిగర్వము లేదుగదా. ధనమదాంధులు కాదుగదా. మీకు పరిశుద్ధ మనుష్యులను భావన మీకు లేదుగదా!"

"అవును భన్తే!"

"మీ సేవకుడైన ఉపాలిని మీకంటే ముందుగ దీక్షితునిజేసి దీక్షలో నితనిని మీకు పెద్ద సోదరునిగా జేయుచో మీరితనికి సంతోషముతో వినయమును చూపుచు, నాదర సత్కారములు చేయగలరా?"

"భంతే, చేయగలము."

"మంచిది. అట్లగుచో నితడే మీకు జ్యేష్ఠ సోదరు డగును."

తదనంతరము ఉపాలికే నేను ప్రథమ దీక్ష నిచ్చితిని. శాక్యపుత్రులతనికి వినయవిధేయతలు హృదయపూర్వకముగ జూపుచున్నట్లు నేను సూక్ష్మముగ పరీక్షచేసి గ్రహించితిని. దేవదత్తుడు మాత్రము కొంచెము సంకోచించుచున్నాడు. ఈదేవదత్తుని వలననే సంఘమునకు ముందు కొంత విపత్తు కలుగవచ్చునని తోచుచున్నది. "దేవదత్తునికి తనపేరు ప్రపంచమునకు దెలియవలయునని చాల కోరికగలదు. ఇది నామ మోహము. ఇతనికే అధికారమున్నట్లైన ప్రతి సాధువు యొక్క కమండలము మీంద "దేవదత్తుడు" అని వ్రాయించి యుండును. అతడు కూర్చొను ఆమ్రవృక్షముయొక్క శాఖ లన్నిటిమీంద "దేవదత్త" నామాక్షరములు చెక్కినాడు. చూచినవారందరు చదువుకొని యిది "దేవదత్తుని" ఆసనమని తెలిసికొనునట్లుగ తన ఆసనమునకు నలువైపుల నిటుకలతో "దేవదత్త" అను అక్షరములను పేర్చినాడు.

కాని, ఉపాలికి, దేవదత్తున కెట్టి సామ్యమున్ను లేదు. ఇతడు అధ్యాత్మిక మహత్వాకాంక్షి. నాసిద్ధాంత ముల నితడు చక్కగ చదువదలచుచున్నాడు. చదువుచు న్నాడుగూడ. గొప్పవినీతుడు. జాతి మతము అసలు లేక పోగ నామమోహముకూడ అతనికేమాత్రము లేదు. భవి ష్యత్తులో నితడు మహాశ్రుతధరుడు (పండితుడు) గాగలడు. నాసాహిత్యము నంతయు సురక్షితముచేసి అర్హంతుడు కాగలడు.

ఆనందుఁడొక విచిత్రస్వభావము గల యువకుఁడు. తొందరపాటు, సులభకోపిగ మితెనికున్న అవలక్షణములు. అయినప్పటికి నేనన్నను, నాభిక్షుసంఘమన్నను ఆతనిహృదయములో నమితమైన ప్రేమకలదు. ఇతఁడు త్వరగా నుద్రిక్తుఁడైనను వెంటనే శాంతించును. ఇతఁడు భిక్షుసంఘమునం దొక విశేషమైన వ్యక్తి కాఁగలఁడు. కాని విశేష వ్యక్తి యయినప్పటికిని, హృదయపూర్వకముగ సేవచేసినప్పటికిని తన చపలత్వమువలన నుద్రేక స్వభావమువలన లాంఛితుఁడు గాఁగలఁడు.

ఇతఁడు శాక్యులకు రాజయిన భద్రికుఁడు. వీఁడు చాల నిర్దోషిగా కనపడుచున్నాఁడు. "భద్రికుఁ డేకాంతమునఁగూర్చొని అహాహా! ఎంతటి ఆనందము, ఎంతటి సుఖము" అని మాటి మాటికి తలపోయుచుండునని కొందఱుభిక్షువులునిన్న నే నాతో చెప్పిరి. నేను భద్రికుని పిలిచి నిజముగ నీకట్టి ఆనందము కలిగినదని మాట్లాడుచున్నావా అని యడిగితిని. అతఁడు తన యనుభవములను జెప్పెను.

ఈవిధముగా భద్రికుఁడు నిజమైన సాధువైనాఁడు. కాని రాహులుని కంకను నిజమైన సాధుత్వము రాలేదు. బహుశా నాకు పుత్రుఁడగుటయే అతని సాధుత్వమునకు నాటంకము కావచ్చు. అబద్ధము లాడుటయే అతనియందున్న గొప్ప దోషము. నాయెదుటఁగూడ తన హృదయమును విప్పి మాట్లాడఁడు. అతనియందున్న దోషము నిరూపింపఁబడినప్పుడును

నతడు దానిని స్వీకరించక నేదో యొక నెపము చూపించును. అతడు నెపమును చూపించుటకు వీలులేనట్టి దోషమును నేను చూపించి అతడు చెప్పుకారణము లన్నియు నాధారరహితము లని నిరూపించినప్పుడును పశ్చాత్తాపమునైనను ప్రకటించడు. ఒకప్పుడు పశ్చాత్తాపమును ప్రకటించినను నాపై దయచూపుమన్న ట్లర్థమునచ్చెడి శబ్దములలో ప్రకటించును. ఉచితస్థానమునందైన పరిశుద్ధమైన ఆలోచనచేయు లేని మనుష్యు డెప్పటికి పవిత్రుడు కాజాలడు. అర్థహీనమైన ఆలోచన అనాలోచనముకంటెను నీచము. మొన్నటిదిన మత.డబద్ధ మాడెనని సప్రమాణముగ నిరూపించినను శుద్ధాంతఃకరణముతో నపరాధము నతడు స్వీకరించక "మీరు పెద్దలు. మీరు నన్నపరాధియనియనుచున్నారు. కాన నేనపరాధినికావచ్చును. అందుకుగా శిక్షననుభవించుటకు సిద్ధముగానున్నా"నని పలికెను.

ఈ విధముగ వినయ(విధేయత)మను నెపముతో తన అపరాధమును దాచుకొనెను. ఒక్కొక్కప్పు డతనికి ఈమాత్రపు సాత్వికమైన వినయముకూడ లేనప్పుడు గర్జించి "నేను మీపుత్రునయినప్పటికి మీరు నన్ను నమ్మనట్లు లే"దని చెప్ప నారంభించును. గర్జించుటవలన నాతనియందు నాకు విశ్వాసము కలుగునని తలంచును. విశ్వసనీయ కార్యములవలన మోసములేకుండ తన హృదయమును పవిత్రముగ నుంచుకొనుటవలన విశ్వాసము కలుగునను విషయము రాహులు డెఱుంగజాలడు. నిన్న నేను అంబలట్టికకు వెళ్ళి ఏకాంతమందు రాహులునికి వినయమును బోధించితిని.

# 14. వినయశిక్షణ.

సాధువగుటకును, సాధు సంఘమున సభ్యుడగుటకును గొప్ప భేదమున్నది. వినయవిధేయతలు, త్యాగమెఱుంగని భిక్షాభ్యాసకులు నా సంఘమునందు ప్రవేశించిరి. గృహమును త్యజించిరి, కాని గృహ వ్యామోహము మాత్రము వారిని వదలలేదు. గొప్ప గొప్ప త్యాగసంపన్నులైన సాధు పుంగవులనుగూడ వారు లెక్కించరు. ఈ నీచ భిక్షువులు విహారమునందున్న ఉత్తమోత్తమస్థలముల నాక్రమించి విశేష గుణ సంపన్నులైన సాధువులకు కూర్చొనుటకైనను స్థలము నీయరు. నేను ప్రాతఃకాలము విహారమునందు స్థలము లభించనందున సారిపుత్రుడు విహారమునకు వెలుపలనున్న నొకచెట్టు క్రింద కూర్చొనియున్నాడు. అతడు రాత్రియంతయునావిధము గనే గడిపెనని యడిగి తెలిసికొంటిని. ఎంతటి ఆశ్చర్యజనకమైన విషయము. సారిపుత్రుడు నాకు ప్రియశిష్యుడగుటయే గాక ననేకమంది భిక్షువులకు గురుతుల్యుడు. అట్టి వానికి కూర్చొనుటకుగూడ స్థలము నివ్వజాలని కృతఘ్నులు ఈభిక్షువులు. వీరికి వినయము కొంచెమైనను తెలియదు.

ఆదర్శ మానవజీవనమనగా నెట్టిదో చూపించుట పశుబలముకంటె న్యాయబలమే గొప్పదని నిరూపించుట. ధనము, యశస్సు, ఆదరము, సత్కారము, భోగము, ఉపభోగము మొదలైనవాటికొఱకై పరుగిడుటలో సుఖ మేమాత్రము

లేదని ఋజువుచేయుచు, ఔచిత్యానుసారముగ వాటిని సమర్పించుటలోనే సుఖమున్నదని నిరూపించుట భిక్షుక సంఘములోని ప్రతి భిక్షువుయొక్క కర్తవ్యము. ఈ సదుద్దేశ్యములను ప్రచారము చేయుటకై నేను భిక్షుసంఘము (సాధుసంఘ) ను స్థాపించితిని. నిజముగ నీయుద్దేశ్యములకొఱకే నా సంఘమున చేరవలెను. కాని కూర్చొనుస్థలమునకే పోట్లాడుకొనునట్టి ఈ యోగపురుషులు, ఉదారులు, గంభీరులు, మహాత్ములునైన సాధుసేవకుల నవమానించుచున్నారు. మనకు విహారమునందు స్థానము లభించునో, లభించదో యను చింతచే వారెల్లప్పుడు బాధపడుచుందురు. గుణ గురువుల నవమానించునట్టి ఈ అయోగ్య సాధువులు ప్రపంచమున కేమి నేర్పగలరు? ప్రజల నెట్లు సంస్కరింపగలరు? నే నెల్లప్పుడు నూతన విహారములోనికి నతి సంతోషముతో నడుగిడుచుందును. కాని నేను మాత్రము నాకు గూర్చొనుటకు స్థలముండునో లేదో యను చింతతో వెళ్ళవలసియుండును. బహుశః నాకును స్థలముండకపోవచ్చును. నేను కూర్చుండుస్థలమున, వినయరహితుడైన సాధువు ఆసీనుడగుటచూచి యితరు లెట్లు తలంచుదురో కదా! భిక్షుసంఘము చెడిపోవును.

గృహస్థులయందును మోహము, మమత, స్వార్థములు, పెనగొనియున్నవి. కాని ఈభిక్షువులవలె బుభుక్షాపీడితులైన గృహస్థులు చాల తక్కువమంది యుందురు. వారికి వినయమున్నది. అపరిచితులైన వారిని గురించియో లేక ధూర్తులని భావించినవారిని గురించియోవారవినయమును ప్రదర్శిం

తురు. సర్వసాధారణముగ సపరిచితులనుసరించి శిష్టాచార మునైనను వారు పాలింతురు. కాని అయోగ్యులైన నీభిక్షువులు వినయమునే యెఱుంగరు. ఇక శిష్టాచారము నేమి పాలింపగలరు. నాభిక్షుసంఘము నిట్లశిష్టముగా నున్నచో ప్రపంచమునకు భారమై శీఘ్రముగా నష్టమైపోగలదు. నేను వారి నందరిని సమావేశపఱచి ఛీకొట్టి వినయ పద్ధతులను నేర్పితిని.

భిక్షువులారా! అత్యావశ్యకములైన ఈవినయ నియమములు (బౌద్ధ ధర్మములు) మీకొఱకేర్పరచ బడినవి. ఈనియమములను మనఃపూర్వకముగ నాచరణాలో పెట్టవలయును. ప్రపంచముకొఱకు మాత్రము శిష్టాచార మని నీవాచరించినప్పుడు నీకు వినయముగాని సంయమముగాని లభించదు. వినయహీనమైన శిష్టాచారమువలన వాత్సల్యము, ప్రేమ, సానుభూతులు లభించజాలవు. శిష్టాచారమైన నను సరించనప్పుడు వైరమధికమగును. వినయము ప్రాణము వంటిది. శిష్టాచారము శరీరమువంటిది. మీరు రెంటి ననుస రించుట ముఖ్యము.

భిక్షువులందరకు వినయ నియమములను బోధించితిని. వారువాటిని పాలించుదురని ఆశింతును. వ్యవహారమునకంత యు వినయమే మూలాధారము. భిక్షుసంఘము సువ్యవస్థలో నుండవలెనన్న వినయ నియమ పరిపాలన మత్యంతముఖ్యము. యంత్రమువలెవినయనియమములనుద్దేశ్యరహితముగ పాటించు

వాఁడు నిజమైన వినయసంపన్నుఁడా? నిజమైన వినయసంపన్నుఁడాచరించిన వన్నియు నియమము లేయగుచుండును. అనగా నేను మాత్రము వినయనియమముల నేర్పరచితిని. వినయము కలవాఁడు స్వాభావికముగనే వాటిని పాటించును. భీతుడైన వానికి భయాచారమును నేర్పవలసిన పని లేదు. భయంకరమైన ప్రాణినిజూచి భయపడుట, తనకై తానె కంపించుట, దూరముగా పరుగిడుటకు ప్రయత్నించుట మొదలైన పనులు భయపడినవాఁడు సహజముగనే చేయును. అదే విధముగ వినయసంపన్నునకు వినయాచారములు నేర్పవలసిన పని లేదు. వినయాచారపద్ధతులు తెలియకున్నను వినయము కలవాఁడు స్వయముగనే లేచి నిలువబడును. చేతులు జోడించును. సేవ చేయుటకు ముందు కడుగిడును. ఉన్నతాసనము నితరుల కిచ్చును. ఈ నియమములన్నియు నతనికి నేర్చుకొనవలసిన పని లేదు. మనస్సులో వినయము లేకపోయినను బాహ్యమునకు మాత్రము వినయాభినయమును చూపించునతనికీ వినయాచారములను నేర్పవలసియుండును. నిజముగ సాధువులైన వారికీ నియమము లవసరము లేదు. కాని ఈ అయోగ్యులు సాధువులు కాలేరు. చక్కని వ్యవస్థకొఱకుగాను వీరిని నియమ పాలితులుగా మార్చుటెంతయో నవసరము.

ఇష్టము లేకున్నను చివరకు భిక్షుకీ సంఘమును స్థాపించవలసివచ్చినది. మాటిమాటికి బ్రతిమాలి ఆనందుఁడు నా యాజ్ఞను పొందెను. అతి మూర్ఖుడతఁడు. దీర్ఘదృష్టి అతనికి బొత్తిగా లేదు. "అర్హత" పదవిని స్త్రీలు పొందగలరని

నేనంగీకరించుటయేగాక ననేక స్థలములందు వెల్లడించితిని. కాని పవిత్ర జీవనమును గడుపుచు, సమాజమందున్న కురీతులను దూరముచేయు సమర్థులైనట్టి ప్రజాసేవకులను నిర్మించుటయే భిక్షుసంఘమునొక్క ఆశయము. స్త్రీలైనను, పురుషులైనను గృహమునందుండియు నర్హాతపదవిని సాధించ గలరు. కాని నిష్పరిగ్రహులు, నిర్భయులు, నిస్స్వార్థులు, చక్రవర్తిని, భిక్షువుని సమదృష్టితో చూడగలిగినట్టి సాధు సేవకులు గృహమందు మాత్రము లభించరు. అందుకొరకు నే నీ ధర్మసైన్యమును పోగుచేయ నారంభించితిని. ధర్మ సైన్యమున స్త్రీలు వేఱుగాను, పురుషులు వేఱుగాను నుండ వచ్చును. పురుష సైన్యమువలన సమూహము లధికముగ నుండును. నేను స్వయముగ పురుషుడను గాన పురుషసేనా సంచాలన కార్యమును చక్కగ జేయగలను. అందుచేత, నేనీపురుషసైన్యమును తయారుచేసితిని. ఇచ్చట స్త్రీసైన్యము, పురుషసైన్యము రెండు కలసియున్నప్పుడు విహారప్రదేశములు గృహస్థులవలె మారిపోవును. మామూలు గృహస్థులు లోకమునుజూచి భయపడక తమ దాంపత్య జీవనమును గడుప గలరు. కాని భిక్షుసంఘమున దాంపత్యమునకు చోటు లేనందున బాహ్యమునకు వెఱచి భిక్షువులు హృదయాంత రాళమునందు ప్రేమాకర్షణమును పెంపు జేసికొందురు. తద్ద్వారాభిక్షుసంఘము మెల్లమెల్లగ పతితమై కృశించి నశించి పోవును.

మొన్నటిదినమునొక భిక్షుకీ నివాసస్థానమునకు నెదుట

నొకభిక్షువు పలుమారులు తిరుగుచుండుట జూచితిని. ఒకప్పుడు దంతధావనజేయు నెపముతో మరొకప్పుడు జలాన్వేషణమను నెపముతో నతడచ్చట దిరుగుచుండెను. అట్లుజేయుట పాడిగాదని నేనుమందలించితిని, ఇప్పు డతని ప్రవృత్తి మఱి యొకరకముగ మారినది. అవసరమున్నను లేకున్నను ఆ భిక్షుకిని ప్రశంసించుచునే యుండును. "ఆమెశీలవతి, గుణవతి, విదుషీమణి, శంకాసమాధానములను జక్కగజేయును. చక్కని వక్తృత్వ ప్రతిభా సంపన్నురా"లని అతడు మాటి మాటికి పొగడు చుండును. ఆమెయందా గుణములన్నియు కలవనుటకు సందేహముండదు. ఆమె యిట్టి భిక్షువులకు వశపడునట్టిదియుగూడ కాదు. కాని యిందుమూలమున కొంచె మైన లైంగికాకర్షణ కవకాశము లభించును.

మరి కొందరు భిక్షువులు కొన్ని విషయములను చర్చింపవలయునను నెపముతో భిక్షుకులయొద్దకుపోవుచుందురు. భిక్షుకుల ననవసర ప్రశ్న పరంపరలచే విసిగించి వారివలన చీవాట్లనుతిని, అవియే మహానందదాయకములను వారుగూడ కొందరున్నారు. కొందరు వినయమను నెపముతో భిక్షుకుల కెదురుగ చేతులు జోడించుదురు. కొందరుభిక్షువు లుపదేశము వినవలయునను నెపముతో చతురలైన భిక్షుకులను చేరుదురు. ఈవిషయములన్నియు నిషిద్ధములని నేనుచెప్పితిని. భిక్షువు లెవరు భిక్షుకులకు వినయ మొనర్చుటగాని వారి ఉపదేశము లను వినుటగాని కూడదనియు ఏభిక్షుకియు భిక్షువు నదలించుట, బెదరించుట, నోటికి వచ్చినట్లు మాట్లాడ రాదనియును

వారించితిని. కాని ఈ నిషేధాజ్ఞవలన వారికున్న పరస్పరాకర్షణ తగ్గిపోగలదా? నేరమన్నింటికంటెను సులభమైనవస్తువు. నేను నూరు నియమములను చేయగలను. వారు నూటనొకటవ నేరమును వెతకగలరు. నియమములు మార్గసూచకములేకాని మార్గప్రేరకములుగావు. సంయమములేని భిక్షువులు నియమబద్ధులు కాజాలరు. భిక్షుకుల వలన శీఘ్రముగ భిక్షుసంఘము పతనగర్తమున పడునని తోచుచున్నది. క్రమక్రమముగ భిక్షుసంఘము పాపాచారముల కాలవాలముగా గలదు. భిక్షుసంఘము సంఖ్యలో ద్విగుణీకృతమైనను, ఆదర్శములు మాత్ర మర్ధభాగమునకే దిగజారినవి. నామమాత్రమునకే పవిత్రత మిగిలిపోవును. మంచికొరకై ఆనందుడు చేసిన ప్రయత్నమనేకరెట్లు చెడుగునకే తోడ్పడగలదు.

## 15. చమత్కారములు, నిస్సారములు.

ప్రాణిమాత్రమునకు సుఖశాంతిని ప్రసాదించుటయే ధర్మముయొక్క పని. ఈ మార్గమునం దత్యధిక సమయమును వినియోగించుచు యథాశక్తి త్యాగముచేయగలవాడే నిజమైన ధర్మాత్ముడు. కాని ప్రపంచ మెంతో పిచ్చిది. గుడ్డిది. ధర్మపాలన మొనర్చలేక పోయినను, ధర్మమునకు సరియైన గీటురాయినిగూడ కనుగొనలేకున్నది. వైద్యజ్ఞానము నాధారముగా చేసికొని కొందఱు ధర్మమును పరీక్షించగా

మరికొందఱు శ్రోత్రియజ్ఞానమును ధర్మమునకు నాధారముగా జూపుదురు. నాట్యకళయే ధర్మమున కాధారముగ నింకను కొందఱు భావింతురు. ఈ మూర్ఖత్వమునకు హద్దెచ్చట? ఈ వైజ్ఞానము లేవి లేకపోయినను నాత్మశుద్ధి, ప్రజాసేవ జరుగ గలవు. ఈ వైజ్ఞానమున్నను ఆత్మ పారిశుద్ధ్యము, లోక కల్యాణభావన లేకపోవచ్చును. ఐనప్పటికి ప్రజ లిట్టివిషయ ముల నాధారముగ జేసికొనియే ధర్మమును పరీక్షించు చున్నారు.

మొన్నటిదినము రాజగృహమునందున్న నగర శ్రేష్ఠి కిట్టి పిచ్చితనమే కలిగినది అత డొక చందనపాత్రను చేయించి యొక పొడుగాటి బొంగునకు వ్రేలాడగట్టి "మీరు అర్హతు లైనచో నీ బొంగుమీదికెక్కి పాత్రను తీసికొను" డని రాజ గృహమున కేతెంచిన ప్రతి భిక్షువును ప్రశ్నించుచుండెను. గడమీద కెక్కుట, నిలబడుట, అటునిటు నూగుట సర్కస్ వారి పని. ఇది అర్హతునిపనికాదు. దీనినే అర్హత పదవికి గీటు రాయిగ తీసికొనుట మూర్ఖులు చేయు పొరపాటు. గడమీద కెక్కగలిగినవారెల్ల రర్హతులు కాజాలరనియు, గడమీదకు ఎక్కలేనంత మాత్రమున ననర్హతులు కాజాలరనియు నీ వెరుంగుము. ఆ శ్రేష్ఠి మూర్ఖుడు. ప్రజలును మూర్ఖులు. నా శిష్యులలో ననేకసంఖ్యాకులు మూర్ఖులే. నా శిష్యవర్గము లోనివాడైన పిండోల భరద్వాజు డా శ్రేష్ఠివద్దకు వెళ్ళి నటునివలె గడమీదకు నెక్కి పాత్రను విప్పుకొని వచ్చెను. గొప్ప ధర్మకార్య మొనర్చితినని పిండోలుడు తలంచెను. ప్రజ

లతనివెంట గుంపులుగ గూడిరి. తా సన్మానితుడైనట్లు పింఁడోలుడు భావించెను.

పిండోలునివంటి మూర్ఖశిష్యు లిదియే ధర్మ మహాత్మ్య మని భావించినప్పుడు ధర్మమార్గమున, త్యాగులకు, నిజమైన సమాజసేవకులకు స్థానమే లభించదు. ధర్మసంస్థలన్ని నటు లకు వస్త్రస్థలములు కాగలవు. అందుకనియే భిక్షుసంఘమును సమావేశపరచి అందరి ఎదుట పిండోలుని బెదరించి అతని చందనపాత్రను ముక్కలు ముక్కలుగా చేయించితిని.

భిక్షాపాత్రకు కాష్ఠమునే ఉపయోగించుమని ఆజ్ఞ యిచ్చితిని. కాష్ఠపాత్రలకు మూల్యము తక్కువగుటయే దీనికి కారణము. దీనివలన భిక్షువులయొక్క అపరిగ్రహ వ్రతమభివృద్ధిజెందుచుండును. భిక్షాపాత్రయను నెపమున సాధువులు చందన పాత్రల నుపయోగించినచో దానికొఱకు వారు ధనసంచయము జేయవలసియుండును. దీనివలన వారికి వ్రతభంగము కలుగును. వారి సాధుత్వమంతయు సర్పము వలె చందనపాత్ర నంటుకొనియేయుండును. అందువలన కాష్ఠ పాత్రలుగాని, ధాతునిర్మిత పాత్రలుగాని ఉపయోగించ వలద నియు, లోహపాత్రలనైనను లేకమృణ్మయ పాత్రలనైన నుప యోగించవలయునని ఆజ్ఞ నిచ్చితిని.

ఈభిక్షు సంస్థకు మంచి నియమముల నేర్పఱచి, అతి పవిత్రముగ నుంచవలెనని తలచితిని. కాని దీనివలన నా సంక

ల్పము పూర్తియగుట లేదు. "మీశిష్యులు చమత్కారములు చేయవద్దని లేక చెప్పవలదనిగాని మీరు నిషేధముచేసితిరా" యని నిన్న బింబిసారుడను రాజు అడిగెను. దీనివలన ధర్మ ప్రచారమునకు గొప్ప ఆటంకము కలుగును.

"చమత్కారములవలన మానవునియందున్న అవిసీతి తెలియునుగాని, అతనికున్న ధార్మిక భావన తెలియదు"

"అవును. అది నిజము. కాని ప్రపంచము చమత్కార ములు నిస్సారములని గ్రహించునంతవరకు వారి మార్గమునే మనమనుసరించ వలయును. చమత్కారముల వలన సత్య ప్రాప్తి కలుగునని వారికి నమ్మకమున్నంతవరకు వారి నా దారినే నడువనివ్వవలయును."

"రాజా! చమత్కారములే స్వయముగ నసత్యములు. అవి సంఘమున ప్రవేశించిన మీదట సత్యమునకు స్థానముండ బోదు. చమత్కారములకు నమస్కరించు వారవియే సత్యమని నమ్మువారు స్వయముగ నాత్మవంచన చేసికొనుటయేగాక ప్రపంచమునుగూడ వంచించుచున్నారు. చమత్కారము (సిద్ధ్యాదులు) లౌకకళ, ఒకమోసము, ఒక విధమగుగారడి, ఒక ఇంద్రజాలము. ఏగారడివాడైనను హాటినిజూపించగలడు. కాని గారడివా డర్హతుడు కాజాలడు. అర్హతుడగుటకు ఇంద్రజాలాది చమత్కారము లవసరముగావు. దానికాత్మ శుద్ధి యవసరము."

"మహాత్మా! తమరు చెప్పునది సత్యమే. కాని తమ

శిష్యులు చమత్కారములను జెప్పబోరు ఇతరులు వాటిని నుడువుదురు. దీనిఫలితముగ బ్రజలెందరిజాలికుల యుచ్చులకులోనై సత్య,ధర్మస్వరూపము లైనమాయుపదేశములకుదూరులగుదురు"

"సత్య, ధర్మములకు బ్రజలు విముఖులైనచో వాటి లాభమునే కొంతమంది ప్రజ లనుభవింపగలరు. కాని బ్రజలే దీనియందు దూరి ఈ సత్యధర్మములను నసత్యధర్మములుగా మార్చివేసినప్పుడు కొంతమంది ప్రజలైనను సత్యధర్మములను పాటించలేకపోవుదురు. పొందదగిన వస్తువే లేనప్పు డిక దానికి బ్రియత్న మేముండును?"

"మహాత్మా! చమత్కార మోహములనుండి ప్రజలను దొలగించుటకొఱకై కనీసము తమరు చమత్కారముల యొక్క నిస్సారత్వమును గురించి ప్రజలకు బోధించుచుండవలెను. తత్ఫలితముగ బ్రజలు మాయికులయొక్క వలలలో బడకుందురు."

"అవును. ఇందుకొఱకు మీరు ప్రజలను సమావేశపఱచుడు. యమకప్రాతిహార్యమును గురించి బోధింతునని చాటింపుడు. ప్రజలందరు సమావేశమైనప్పుడు వారితో నేనిట్లంటిని. "ప్రజలారా! మీ రిప్పటికే నితరులయొక్క ప్రాతిహార్య చమత్కారములను జూచియున్నారా?" ఒక డిట్లు జవాబుజెప్పెను:— "స్వామీ!ఒకసారియొకయుర్వ్యాతు డిచ్చటికేతెంచి యొక దీపమును వెలిగించెను. దాని మధ్యనుండి యొక జలధారను బ్రవహింపజేసెను. ఈ విధముగ నగ్ని జల సంయోగము నొక్కచోటనే జూచి చకితులమైతిమి."

"ఇంతకొలఁది మీరతని సద్వ్రతునిగ భావించెదరా?"

"అవును. స్వామీ!"

"నీసుములలో విద్యుత్కాంతులు మీరు కాంచు చున్నారుగదా! అది దీపమంతయు బయలుదేరిన నీటి ప్రవాహముకంటె గొప్ప చమత్కారమేకదా!"

"అది ఈశ్వరీయ చమత్కారము. ఈశ్వరుడే చేయునట్టి చమత్కారమును స్వహస్తములద్వార చేసి చూపించునట్టి మానవు డొక మహాసిద్ధపురుషుడై యుండునని మా తలంపు."

"నీ భార్య యెప్పుడైనను నీటిని వేడిజేయఁగలదా! లేదా?"

"చేయఁగలదు"

"ఆ వేడినీళ్ళు నీ చేతిమీద బడినచో నీ చేయి కాలునా! లేదా?"

"కాలును."

"ఆ వేడినీటిని నగ్నిమీద జల్లినప్పుడగ్ని యారి పోవునా? లేదా?"

"ఆరిపోవును."

"చూడు! ఇది గొప్ప చమత్కారము. ఒకే వస్తువు కాల్పఁగలదు, ఆర్పఁగలదు. ఈ చమత్కారమును నీ భార్య

స్వాధీనముగ జేయగలము. ఇంతమాత్రమున నీవచ్చి సర్వాతు రాలని భావించెదవా? లేదా?''

అందుకు సవ్వసాగిరి.

''ఏమి? మీరెందుకు నవ్వుచున్నారు? మీభార్యగూడ ఈశ్వరీయ చమత్కారమును స్వహస్తములతో జేసి చూపించును గాన మీనియమమునను సరించి యామె యద్భుతురాలెందుకు కాగూడదు?''

''నీళ్ళను వేడిజేయుట మామూలు విషయమేకదా? ఇంతమాత్రమున కెవ్వ రద్భుతులు కాజాలరు.''

''అగ్నైన దీపమునుండి జలమును బ్రవహింపజేయు వారును నద్భుతులౌదురు! గొట్టమునుండి పైకెగయుచు నాల్గు వైపులను బడుచుండు నీటి తుంపురలను మీరు చూచితిరిగదా! ఆనీటితుంపురలకు నాల్గువైపుల గొట్టమున కానునట్లుగ వత్తులంటించి యెక్కువగా నూనెను నింపినప్పుడు నాల్గువైపుల దీపములు వెల్గుచుండును. ఆదీపముల మధ్యనున్న గొట్టమునుండి నీరుబయటికి వచ్చుచుండును. అందులో నాశ్చర్యమేమున్నది?''

''స్వామీ! మాకుదెలియదు. అందువలన నది మా కాశ్చర్యజనకముగ నున్నది.''

''మంచిది. మీరు ప్రపంచమునగల విషయముల నన్నిటిని తెలిసికొనలేక పోయిరను నీప్రపంచమున నొకటికి మించిన యాశ్చర్యములనంతముగానున్నవనినమ్మెదరా? ఏపనియు ప్రాకృతిక నియమములకు వ్యతిరేకముగ జరుగదు. ప్రకృతి

యొక్క నియమములను దెలిసికొని చమత్కారములను జూపించినవాఁడు చతురుడనియో లేక నేర్పరియనియో పిలువబడును గాని యర్హతుడనిమాత్రము పిలువబడఁడు. భౌతికవిషయములందుగల విద్యాపాటవముచే నెవఁడు నర్హతుఁడు కాఁజాలఁడు. ఆధ్యాత్మిక విషయములే యర్హతునియొక్క చమత్కారములు."

"ఆధ్యాత్మిక చమత్కారము లనగా నెట్టివియను?"

"అగ్ని, జలము లొక్కచోటనుండుట చమత్కారమని మీరు భావించినట్లుగనే శత్రువును, మిత్రుని నొక్కే విధముగ జూచుటయును చమత్కారమే. ఒకఁడు మీ కుపకార మొనర్చును. మరియొకఁడు మీ కపకార మొనర్చును. వారిద్దరియందును మీకు సమభావముండగలదా?"

"ఉండదు స్వామీ!"

"దీపమునుండి నీటిని బ్రవహింపజేసి మీకు జూపించిన వ్యక్తికి నట్టి సమభావముండునా?"

"వారికిని యట్టి సమత్వముండదు. మీరు లోపల జలసంగ్రహమును జేసి తద్ద్వార జలమును బ్రవహింపజేయుచున్నా"రని యొకయమాయకుడు ప్రశ్నించగ, వారేకృద్ధులై "యవిశ్వాసియనియు, నాస్తికుడనియు" దిట్టి యతనినిబయటకు బంపించెను. వారికి సమభావ మేకోశమందును లేదు."

"చాలు. అగ్ని జలముల నొకచోట జూపించుట సరళమనియు, శత్రు మిత్రులకు హృదయమందు సమాన

మైన స్థలమిచ్చుట అనగా హారితి నిష్పక్షముగా వ్యవహరించుట కఠినమనియు మీ రెఱింగితిరి. శత్రుమిత్రులయందు నొకేవిధమైన సమభావమును జూపుటయే యమక ప్రాతిహార్య మనబడును. ఈ యమక ప్రాతిహార్యమును జూపింపగలవాడే యర్హంతుడగును. మీ రింద్రజాలురకు బూజారులు కావలదు. శత్రుమిత్రులను, ఉత్తమాధములను, ధనిక దరిద్రులు మొదలైనవారిని సమానముగ జూచుచు, వారందరి కల్యాణము గోరువారే నిజమైన యర్హంతులు. వారినే మీరు పూజింపవలెను."

---

## 16 పోట్లాడునట్టిభిక్షువులు-వివేకులైనఉపాసకులు

(గృహస్థులైన బౌద్ధ మతానుయాయులు)

ప్రపంచమున కెల్లప్పుడు దండన యవసరమని తోచుచున్నది. ఈ భిక్షుసంఘమున బ్రవేశించి నిరంతరోపదేశశ్రవణానంతరముగూడ ననేక భిక్షువులు వినయమును, సవినయమును మఱచిపోయి యహంకారులై నాయెదుటనే వదరుచు, పోట్లాడుకొనుచున్నారు. 'మీరు చేయుపని లోకకల్యాణమునకు వ్యతిరేక'మని జెప్పినను వినక దాము చేయుచున్న చెడుపనినే మంచిపనియని చెప్పి వాదించునట్టి మూర్ఖులు భిక్షుసంఘములో గొందరున్నారు. వారి దోషములను వారికెఱుకజేసినప్పుడు కొందఱు కొంచెమైనను దెలిసికొనకయే "చాలు చాలు. తెలిసిన" దని చెప్పి తప్పించుకొందురు.

మరల పొరపాటు జేసినప్పుడు మాకేమియు దెలియదని జెప్పుదురు. బోధించునప్పుడు జిజ్ఞాసను బ్రకటించుట నవమానముగ నెంచి తెలిసినట్లు నటింతురు. బోధించుట మానివేసినప్పుడు చేయుటకు దెలియక, బ్రమాదము లొనరించి మాకేమియు దెలియదని తప్పించుకొందురు. ఒకప్పుడు మాటలలో మాత్రమే వినయమును బ్రకటించుదురు. కాని యామాటల వెనుకనున్న స్వరములలో మాత్ర మవినయమే ధ్వనించుచుండును. మాట్లాడి నోరు చెడగొట్టుకొనుటయే కాని హృదయద్వారమునుమాత్ర మెప్పుడు దెఱవరు. పరుల యెదుట హృదయద్వారమును దెరువజాలని వా డాత్మసంస్కరణ జేసికొను టసంభవము. అతని మనస్సు పవిత్రము కాజాలదు. అతడు నిర్భయుడు కాలేడు అత డెప్పుడును విశ్వసనీయుడు కాలేడు. ఎంత వాచాలురైన నిట్టివారిని సమాజము తిరస్కరించుచునే యుండును.

నేడు కౌశాంబినుండి ఆజగడాలమారి సాధువిచ్చటికి వచ్చెను. ఆదినము నేనెంతగనో దెలియజేసితిని. కాని యొక స్వల్పవిషయమునుగుఱించి భిక్షుసంఘముయొక్క గౌరవమును మట్టిపాలొనర్చినాడు.

భిక్షువొకడు శౌచమునకై వెళ్ళి పాత్రలో నీటినిమిగిల్చి వచ్చెను. శౌచమునకు తీసికొనివెళ్ళిన పాత్రలో జలశేషము నుంచుట భావ్యముకాదని మఱియొక భిక్షువు సలహానిచ్చెను. ఇది చిన్నవిషయము. ఈపొరపాటును స్వీకరించవలయును.

కాని పరులయొక్క యీమంచి సూచనను స్వీకరించుటకభిలాషపు
నుసిగట్టలేదు. ఇంకేమున్నది. ఈవిషయము నాధారముగ జేసి
కొని వితండవాదమును బ్రారంభించెను. "ప్రపంచము క్షణి
కము. ఇచ్చట పవిత్రము, అపవిత్ర మనియేమున్న" దని
యుపన్యసించు చుండెను. జీవనమున బుద్ధి (Brain) కి భావు
కత్వము(Heart)నకు సమత్వము ముండవలయునని యీమూ
ఢులైన యతివాదులు తెలిసికొనజాలరు. దీనిఫలితముగ నీభిక్షు
వులలో ముఠా (Parties) లేర్పడినవి. రెండుముఠాలు పర
స్పరముపోట్లాడుకొను నట్టివార్తవిని తెలియజేయబోగా వారి
ట్లనిరి:— "మీరు ధర్మస్వాములైతే విశ్రాంతిగ గూర్చొనుడు.
మామధ్యకు రావలదు. మేముస్వయముగ సర్దుకొనగలము."

వారికిగల యీయుద్దండ స్వభావమునుజూచి నేనబ్బుర
పాటుజెందితిని. కాని జగత్స్వరూపము లిట్టివనియెంచి మన
స్సు నూరడించుకొంటిని. వారికి బోధించుట వృథాయైనది.
అత్యధికులు ముందుగ గ్రహించజాలక కష్టనష్టములకు, మా
నావమానములకు గురియైనమీదటనే సత్యమును గుర్తించ
గలుగుదురు. తెలిసికొను యోగ్యతలేనివారికి దెలియజేయుట
వ్యర్థమే. వారికున్న జడత్వమధికమై వారునక్రజడులుగా
మారుదురు. అందువలన నేనువారికి దెలుపలేదు. అంతే
గాక వారు పోట్లాడు కొనుచుండగజూచి వారినచ్చటనే వదలి
కౌశాంబినుండి యిచ్చటకు వచ్చితిని.

నేను తిరిగివచ్చుటవలన కౌశాంబివాసులైన యుపాస

కుల (గృహస్థులు) కు చాలకష్టము గలిగినది. వారు భిక్షసందర్శనము చేయుటమానివేసిరి. భిక్షలిచ్చుటయు నిలిపివేసిరి. అప్పుడు భిక్షువులకు బుద్ధివచ్చినది. ఇప్పుడు వారు పాపమునకు ప్రాయశ్చిత్త మొనర్చుకొనుటకై కౌశాంబినగరమునుండి నేనున్న శ్రావస్తీ నగరమునకు బయలుదేర్కొని వచ్చుచున్నారు.

గృహత్యాగులైన భిక్షువులనుగూడ నీతిమార్గమున మరలించుట కింత కఠిన వ్యవహారము జేయవలసి వచ్చినప్పుడిక మామూలు ప్రజలను మంచిమార్గమున నడిపించుటకెంత శ్రమ పడవలయునో కదా! ఎంతో కఠినముగ వ్యవహరించవలసియుండును. అందుకనుపదేశము, దానితో పాటు దండన చాల యవసరము.

కాని, దండన పశుత్వమునకు చిహ్నము. మనుష్యునకు, పశువునకు గల ముఖ్య భేదమేమి? మనుష్యుడు చెడును స్వయముగ నర్థముజేసికొనగలడు. లేక సంకేతమాత్రముచేనైన దెలిసికొనగలడు. తెలిసినమీదట చెడును దననుండి దూరముజేసికొనగలడు. కాని పశువు కొంచెమైనను దెలిసికొనలేదు. దెబ్బకు భయపడి చెడునుండి దూరముగనుండును లేక యుండవలసివచ్చును. కౌశాంబి భిక్షువుల పశ్చాత్తాపము గూడ నిట్టిదే!

అధిక పశ్చాత్తాపమును పొందియు వారిప్పుడు వాస్తవిక

ఫలమును పొందలేరు. మొదటనే వారు కొంచెము పశ్చాత్తాపమును జూప గలిగినచో నసంఖ్యాకముగ ఫలితము లను బొందుటయేగాక, నా స్నేహమును, ప్రియులయొక్క భక్తిని జూరగొనెడివారు.

మనోసంయమము లేనందువలన గలుగు దుష్ఫలితము పరలోకమునందేగాక నీలోకమునందుగూడ వారనుభ వించుననుటలో సందేహము లేదు.

ఉపాసకవర్గము (గృహస్థులు) వివేకము కలవారైనప్పుడు భిక్షుసంఘమునందు వికృతచేష్టలు కలుగవని యీసంఘటన మనకు ఋజువుజేయుచున్నది. కౌశాంబివాసులైన యుపాస కులవలె ప్రపంచమునగల యుపాసకులందరు వివేకవంతులుగా నున్నంతవఱకు నా భిక్షు సంఘము నిజమైన భిక్షుసంఘముగ నుండగలదు

---

## 17. చతుర్విధ దంపతులు.

కొందరు దంపతులు నేను నారెకునొద్దకువచ్చి ప్రణమిల్లి, నాతో గొంత చర్చజేయ బూనిరి.

"మీరే జాతికి సంబంధించిన దంపతులు?"

"మేము బ్రాహ్మణుల" మనికొందఱు, మఱికొందరు–"మేము

క్షత్రియుల"మని, ఇంకను కొందఱు–"వైశ్యుల"మనిరి. ఇతరులు "శూద్రుల"మని జవాబు చెప్పిరి.

"ఇవి మనుష్యులయందున్న భేదములు కావు. జీవనమునకు సంబంధించిన వృత్తుల భేదములు. ఈ వృత్తిభేదముల ద్వార మానవునియందున్న మంచి చెడుగులుగాని, పాత్రాపాత్రిత్వములుగాని తెలియవు. దాంపత్య సంబంధముగానున్న భేదములు వేఱు. శవదంపతులు, శవపతిక దంపతులు, శవపత్నీకదంపతులు, జీవిత దంపతులని చతుర్విధములైన దంపతులున్నారు."

"ఈ భేదములయొక్క తాత్పర్య మేమి స్వామీ?"

(1) "భార్యాభర్త లిరువు రెచ్చట దురాచారులుగను సంయమహీనులుగను, కలహప్రియులుగను, నిష్కర్మణ్యులుగనుందురో వారు శవదంపతు లనబడుదురు."

(2) "పతి దురాచారాది దోషములకు లోనై, పత్నిమాత్రము సదాచారిణిగను, శాంతమూర్తిగను, పరిశ్రమమే మతముగ భావించునదిగ నున్నచో, వారు శవపతిక దంపతులనబడుదురు. ఇచ్చట పతి శవరూపముగా నుండును. అనగా జీవచ్ఛవమని యర్థము. పత్నిమాత్రము జీవించియుండును. అనగా గర్తవ్య పరాయణురాలని యర్థము."

(3) "పత్ని దురాచారాది యవగుణములకు లోనై పతిమాత్రము సదాచారుడుగనున్నచో వారు శవపత్నీక దంపతులనబడుదురు."

(4)"ఎచ్చట భార్యాభర్తలిరువురు సదాచారులుగను, సంయమమూర్తులుగను, శాంతస్వభావులుగ, పరిశ్రమశీలురుగ నుందురో వారు జీవితదంపతులనియు లేక దివ్యదంపతులనియు బిలువబడుదురు."

"భంతే! అట్లగుచో మేము శవదంపతులము. జీవిత దంపతులగునట్లు మమ్మాశీర్వదించుదురుగాక!"

"నే నాశీర్వాదమిచ్చితిని. ఆశీర్వదించినందుననే శవములు జీవింపగలవా? స్వహితమునకు, పరహితమునకు సమన్వయము కలిగినప్పుడే జీవింపగలుగుదురు."

---

## 18. జ్యేష్ఠత్వము యొక్క స్వరూపము.

బ్రాహ్మణు డొకడు నగరమునకు రమ్మని నాకు నిమంత్రణ నిచ్చెను. కాని నేడా ముఖు మెచ్చటను కాన రాదే! భోజనాభావమువలన భిక్షుసంఘమునకు కడుదుర్దశ పట్టినది. ఈనగరమున భిక్షుకుల కెవరును భిక్షనిచ్చుట లేదు. అశ్వశాలకు వెళ్ళి వాటికొసగు దానాను భిక్షుకులు తీసికొని వచ్చి రోటిలో దంచుకొని తినుచున్నారు. నా కొఱకుగూడ నానందుడు దానానుదంచుకొనివచ్చెను. నేనుమాత్రము సంతోషముగ నున్నాను. ఈభిక్షుకులకుగూడ అసంతోషము లేదు.

ఈ విపత్తి యేకారణమున వచ్చినను దీనిఫలితము మాత్ర మత్యంత ముదావహముగ నున్నది. ఇట్టి సంకట

సమయముల నెమ్మనకుగల వారెంత్రప్రకారకు లకుట యేగాక జగత్కల్యాణ కారకులుగూడ గాగలరు. విపత్తియే మానవుని మంచితనమునకు గీటురాయి. కొంతకాలమునకు రాజులకు మించిన భోజనము లభించగలుగు దినము లీ భిక్షువులకు రాగలవు. కాని యట్టి సమయమున మీరు సోమరిపోతు లగుదురు. నేను భిక్షువులు ధాన్యమును దంచుకొని తినుచున్నారు. వారే యీభిక్షుసంఘముయొక్క వేళ్ళను చాల లోతుకుదీసికొని వెళ్ళుచున్నారు. నిజముగ వారమరులగుదురు. వారివలన నీసంఘమమరము గాగలదు.

ఈవిపత్తి నిజూచి భిక్షువులు బాధనొందకుండుట సంతోషింపదగిన విషయము. దుఃఖములకు వెఱచువారు, దుఃఖించువారు భిక్షువు లెట్లగుదురు? వారు సేవకు లెట్లగుదురు? ఈపరీక్షలో ప్రతిసేవకుడు నుత్తీర్ణుడు గావలయును. సత్యమును ప్రజలుత్వరగా గుర్తించరు. సత్యనంతుడు జీవించియుండగనే ప్రజలచే గుర్తింపబడినచో నైన లోకులతనిని ద్వేరగాగుర్తించినట్లే. లేనిచో మరణానంతరమే సత్యారాధకుని చక్కగ ప్రజలు గుర్తింతురు. సత్యమునుగాని, సత్యారాధకునిగాని కొలుచుటకు ప్రజలు కొన్నికొలతబద్దల (ప్రమాణములు) నేర్పాటుజేసిరి. కాని క్రాంతికారి యాకొలతబద్దలనే మార్పు జేయదలచుచున్నాడు. ఈప్రయత్నములో నతడోడిపోయెనని యే మొదట ప్రజలుభావింతురు. కాని కాలము గడచుకొలది క్రాంతికారియొక్క మాపదండమునే ప్రజలు గౌరవించి స్వీకరింతురు. అట్టిసమయమున క్రాంతికారి జీవించియున్నను

మృతుడైయున్నను, బ్రజలా మహాత్ముని బూజించుదురు. నా భిక్షుసంఘముయొక్క పరిస్థితియును నిట్టిదే. ఇంకను బ్రజల కొలతలోనది నుత్తీర్ణతను బొందుట లేదు. ఇప్పుడు కష్టములను సహింపగలిగినవారి తపోజీవనముమీద నాధారపడియే భవిష్యత్తులో బ్రజ లమరఫలములను జవిజూడగలరు.

నిన్నటిరోజు కలిగిన విచారము నేను శాంతించినది. ఆ వైరంజక బ్రాహ్మణుడు నేను నాయొద్దకు దెంచి నామీద నీ క్రింది విధముగా నేరారోపణ జేసెను. "ఈ నగరమున గల ప్రికాండ విద్వాంసులును వృద్ధులైన బ్రాహ్మణులు మీవద్ద కరుదెంచినప్పుడు మీరు నమస్కారము జేయక పోవుటకు కారణ మేమి? వారు వచ్చినప్పుడు మీ రెందుకు లేచి నిలువబడుట లేదు?"

వేరంజానగరమున నా సంఘమునకు విరుద్ధముగ నాందోళన జరుగుటకును, సంఘమునందున్న భిక్షువులకుభిక్షలు నిల్పివేయుటకును కారణమిదియని నేను తరువాత నూహించితిని. బ్రాహ్మణుల మహత్త్వమునకు దెబ్బతగిలినది. వారే నాసంఘమును గురించి యుపేక్షగనుండుడని ప్రజలనుదయారు జేసిరి.

అస్తు. ఈవిషయమును మనస్సునందే యుంచుకొని నే నా బ్రాహ్మణు నిట్లు ప్రశ్నించితిని.

"నమస్కారము చేయుమని నా కెందులకు చెప్పుచున్నారు?"

"మీకంటెను బ్రాహ్మణులు జ్యేష్ఠులుగాన."

"వారేవిషయమునందు జ్యేష్ఠులు?"

"ఇతర విషయములందు జ్యేష్ఠత్వమున్నను లేకపోయినను, వయస్సునందుమాత్రము వారు జ్యేష్ఠులేకదా!"

"బ్రాహ్మణుడా! యిటు చూడుము, ఒక కోడి ఎక్కువగ నండములను పెట్టి పొదిగినది. అందులో ముందుగ నొక గ్రుడ్డు పగిలి కోడిపిల్ల బయటకు వచ్చినది. తక్కిన అండములకంటె నా యండము జ్యేష్ఠమగునా? కాదా?"

"అది జ్యేష్ఠమేకదా!"

"మంచిది. అట్లైన నవిద్యా బంధమున బద్ధులైనవారికంటె అవిద్యయను నండమును ఛేదించుకొని బాహ్యమునకు రాగలిగినవాడే జ్యేష్ఠుడుగదా? బ్రాహ్మణుడా! వారికి నమస్కారము జేయకపోవుటకు కారణ మిప్పుడైన తెలిసినదా?"

"భంతే! తెలిసినది, క్షమించుడు, భిక్షుసంఘముతో తమరు నానిమంత్రణను స్వీకరించి నా గృహమును బవిత్రము జేయ బ్రార్థించుచున్నాను."

నేను నిమంత్రణను స్వీకరించితిని. బ్రాహ్మణుడు వెళ్ళిపోయెను. లోకమున నేడు ధనమునకు బూజలు జరుగుచున్నవి. జాతిపేరుతో సన్మానములు జేయబడుచున్నవి. మరియొకచోట నధికారమునకు దలవంచుచున్నారు. ఇంకొకచోట బాహుబలమునకు దాసోహ మనుచున్నారు. సత్యమును

గాని సంయమమునుగాని యెవరును నాదరించుటలేదు. అజ్ఞాన పరవశులై, యభిమానపూరితులై ప్రజలు జాతికి, ధనమునకు, నధికారమునకు, సత్యమును, సంయమమును బలిబెట్టు చున్నారు. కాని నేనట్లు జేయనీయను. ఇంతమాత్రమునకే నాకు నహంకార మున్నదని బ్రజలు భావించుచున్నారు. వారికున్న నీ యమాయకత్వమునకు వారిమీద నాకు దయ గలుగుచున్నది.

---

## 19. బ్రాహ్మణ మహత్వ విరోధము.

నేను శ్రావస్తీ నగరమున కరుదెంచిన 500 మంది బ్రాహ్మణులకు బ్రతినిధిగ నశ్వలాయనుడు నాతో వాద వివాదమును జేయుట కరుదెంచెను. చతుర్వర్ణములవారిని నేను పరిశుద్ధులనుగా జేయుచున్నానని యా బ్రాహ్మణులకు నాపత్తి కలిగినది. అశ్వలాయనుడు వచ్చి సన్నిట్లడిగెను.

"బ్రాహ్మణులే శ్రేష్ఠులు. వారు బ్రహ్మయొక్క ఔరస పుత్రులు. వా రన్యవర్ణములవారికంటె భిన్నులు. వారితో నెవరు సమానులుకారు."

"ఐతే అశ్వలాయనుడా! జార, చోర, యసత్యభాషణ, హత్యాది దోషములు జేసి యితర వర్ణములవారు నరకమునకు బోవుచున్నారు. అదే విధముగ పాపముల జేసిన

బ్రాహ్మణులు నరకమునకు బోరని నీవు తలంచెదవా?"

"అది నేనంగీకరించను. పాపముజేసిన బ్రాహ్మణుడు కూడ నితరులవలె నరకమునకే బోవును. ఈ విషయమందు బ్రాహ్మణులలో విశేష మేమియును లేదు. కాని బ్రాహ్మణు లధికముగ ధర్మాత్ములైయుందురని నా విశ్వాసము."

"అశ్వలాయనుడా! హత్యలను, అబద్ధములను, చౌర్యమును, వ్యభిచారాది దోషములను బ్రాహ్మణులే త్యజించ గలరు. ఇతరులు త్యజించరనియా నీ నమ్మకము."

"గౌతమా! ఇదియును కాదు. త్యాగ మందరిసొమ్మే. అందరు త్యాగ మొనర్చగలరు. ఐనప్పటికి వంశపరంపరగ సంక్రమించు విశేష గుణము బ్రాహ్మణ సంతతియందున్నట్లుగ నితరులయందు గాన్పించదు."

"అశ్వలాయనుడా! చూడుము. ఆడగుఱ్ఱము, మగ గాడిదయొక్క సంయోగమువలన గంచరగాడిద పుట్టుచున్నట్లుగ, బ్రాహ్మణస్త్రీకి, బ్రాహ్మణేతర పురుషునితో సంబంధము కలిగినప్పుడు విలక్షణమైన మరియొకజాతి పుట్టునని నీవు నమ్మెదవా?"

"నేను నమ్మను గౌతముడా! అట్టి విలక్షణ జాతు లేవియు పుట్టవు. కాని సంస్కార విధులందు బ్రాహ్మణులకు నితరులకు చాల వ్యత్యాసము లున్నవిగదా!"

"మంచిది. అట్లగుచో నుపనయనాది సంస్కారము గలిగిన బ్రాహ్మణుడొకడు పాపిగను, దురాచారిగను నుండును.

ఉపనయనాది సంస్కారము లేని మానవు డొకడు సదాచారి గను, పుణ్యాత్ముడుగను నుండును. అశ్వలాయనుడా! వారిద్దరిలో నీ వెవరిని గౌరవించెదవు?"

"సదాచారి, పుణ్యాత్ముడైనవానినే గౌరవించ వలయునుగదా!"

"అట్లైన నేనుచేయు చాతుర్వర్ణ్య శుద్ధికి నీవు చెప్పు సిద్ధాంతమునకు భేదమేమియో చెప్పుము? మనుష్యునియందున్న శుద్ధత్వాశుద్ధత్వము లతని యాచారమును బట్టియే మనకు దెలియునుగాని యతని జాతినిబట్టి తెలియదు. అతని తల్లికి నెవరితో సంబంధ మున్నదో లేక యతని మాతామహి మొదలైన నేడుతరములవారికి నెవరెవరితో సంబంధమున్నదో యెవడు వెళ్ళి చూడగలడు?"

"నిజము భంతే! నిజము. ఒక మానవుని యొక్క పూర్వవంశస్థుల సంబంధము లెట్టివో యెవరికిని దెలియదు."

"అట్లగుచో వంశపరంపరయందు నభిమాన మెందులకు? అందరిని శుద్ధి నొనర్చవలయును. పరిశుద్ధుడైనవాడే యుత్తముడు."

"భంతే! మీ మాటలను నమ్ముచున్నాను. తమ యుపాసకులలో నన్నును జేర్చుకొనుడు."

అశ్వలాయనుడు వెళ్ళిపోయెను.

నిస్సందేహముగ నతనికి జిజ్ఞాస కలదు. అందుచేతనే నతడు సత్యమును దెలిసికొనగలిగెను.

# 20. దిశాపూజనము.

నేను రాజగృహమున (బీహారు ప్రాంతమునందుగల పట్టణము) భిక్షుకై వెళ్ళినప్పుడు తడిగుడ్డలుకట్టుకొని పూర్వ పశ్చిమోత్తర దక్షిణ దిక్కులకు నూర్ధ్వాధోభాగములకు నమస్కారములు జేయుచున్న గృహస్థు నొకనిని జూచితిని. దిక్పూజన మెందుకు చేయు చున్నాడో స్వయముగ నెరుగని యమాయకు డతడు. తండ్రుల, తాతలయొక్క యాచార మని యతడు చేయుచుండెను. ఇట్టి నిరర్థక క్రియాకాండలు మానవ శక్తిని వ్యర్థముగ నష్టము జేయుచున్నవి. ఇంకను ధర్మ మొనరించుచున్నట్లు మానవునికి భ్రాంతి నొనర్చును. ఇట్టికార్యకలాపముల నొనరించుట ధర్మకార్యము మాత్రము కాదు. ఈ కార్యములను జేయకున్నచో ధర్మకార్యము లింకను జేయ లేదను జ్ఞానముండును. ధర్మము పేరున నిరర్థక క్రియాకాండలు జేయుటవలన లాభము లేకపోగ వాటి నాధారముగ జేసికొని పాపములు పెరుగుచుండును. వీటివలన లాభము లేదనియు, త్యజించవలసినదని మన మెంత జెప్పినను బ్రజలకు బోధపడదు. బోధపడినను నచ్చదు. అందువలన వారికి బోధించుటకు వేఱొక మార్గము నవలంబించితిని.

“ఓ గృహస్థుడా! మీరు దిక్పూజన మెందుకు చేయు చున్నారు?”

“భంతే! కారణము నాకు దెలియదు.”

"తెలియకుండ జేయు పూజవలన లాభమేమికలదు?"

"తెలియదు భంతే. దిక్పూజ నెందుకు జేయవల యునో మీరే తెలియజేయుడు."

"చూడుము. మొదట దిక్కులనగా నేవో తెలిసి కొనుము. నీవు పూజించు దిక్కులు యథార్థముగ దిక్కులు గావు. పూజింపవలసిన దిక్కులు వేఱు."

"అవి యేవి స్వామీ?"

"గృహపతీ, తల్లిదండ్రులు పూర్వపు దిక్కు; ఆచార్యుడు దక్షిణపు దిక్కు; భార్యాపుత్రులు పశ్చిమదిక్కు; మిత్రులు మొదలైనవా రుత్తరదిక్కు; సేవకులు మొదలైన వారు నిమ్నదిశ, శ్రమణ బ్రాహ్మణాదు లూర్ధ్వదిశ. ఈ యారుదిక్కులను బూజింపవలయును."

"భంతే! తల్లిదండ్రులను బూజించుట సరిగాని, సేవకుల నెట్లు పూజింపవలయును? సేవకులు నన్ను బూజించుచుందురుగదా!"

"చేతులు జోడించుటయే పూజాశబ్దమున కర్థముగాదు. వినయము, ప్రేమ మొదలైనగుణములతో సేవకులను బాలించుట, బోషించుట, రక్షించుటయే సేవకులను బూజించుటలోగల తాత్పర్యము. సేవకులు నిన్ను బూజించుచున్నట్లుగనే నీవు వారియందు వాత్సల్యమును జూపుచుండుము. ఇదియే వారికి నీవుచేయు పూజ."

"ఈ విధముగ నీయారుదిక్కులను బూజించుటవలన నీవు ధర్మపాలన మొనర్చినవాడవే యగుదువు."

నామాటలా గృహస్థునకు నచ్చినవి. అతడు వంశపరంపరగా జేయుచున్న దిక్పూజనమును వదలి నే నుపదేశించినట్లుగ దిక్పూజనము జేయు నారంభించెను.

## 21. పూజ్యత్వమునకు కారణములు.

నేడు పిండచారమునకై బస్తీకి వెళ్ళితిని. భిక్ష కింకను సమయ మున్నందున "ఉదాయీ" పరివ్రాజకుని యొద్దకు వెళ్ళితిని. నేను వెళ్ళగనే 'భంతే'యని పలుకరించి యతడు నాకు స్వాగతమిచ్చెను. ఏమి మాట్లాడుచుంటిరని నే నడిగితిని.

"భంతే! ఎవరిశిష్యులు తమ గురువు నధికముగ సన్మానించుచున్నారను విషయమునుగురించి చర్చ జరుగుచున్నది. అందులో దమ ప్రస్తావనగూడ వచ్చినది. తమ శిష్యులు తమరి నెక్కువగ గౌరవించెదరని నేనంటిని"

"ఇది మీకెట్లు తెలియును?"

"భంతే! ఒకదినము తమ రుపదేశము నిచ్చుచుండిరి. వందలకొలది శిష్యులు వినుచుండిరి. ఇంతలో నొక శిష్యుడు

దగ్గ నారంభించెను. "పెద్దగా దగ్గవలదు, మెల్లగ విన నీయుడు. శాస్త్ర యుపదేశము జేయుచున్నా"రని మరియొక శిష్యుడు వారించెను. ఈ విధముగ మీ రుపదేశించునపుడు మీశిష్యులలో నెవ్వరు నటునిటుజూడక నిశ్శబ్దముగ నేకాగ్రచిత్తులై మీ యుపదేశములు వినుచుందురు. సంఘమును త్యజించి గృహస్థుడైన శిష్యుడుకూడ సంఘమునం దుండలేక పోయినందుకు దన్ను తాను నిందించుకొనుచు, మిమ్ములను మాత్రము ప్రశంసించుచున్నట్లుగ మేము గుర్తించితిమి. ఈ సంఘటనలనుబట్టి తమశిష్యులు తమ నెక్కువగ గౌరవించుచున్నారని నేను తెలిసికొంటిని. అందువలన మీ యుపదేశములను జక్కగ విని మీ శిష్యులు విద్వాంసులు, వివేక సంపన్నులు సంయమ తత్పరు లగుచున్నారు. తమరి నాదరించుటద్వార వారెక్కువ లాభమును గడించుచున్నారు."

"ఉదాయీ! ఈ పూజ్యత్వమునకు గారణము నీ వెఱుంగుదువా?"

"దీనికి నైదుకారణము లున్నవని నాకు దెలియును. మీరు మితభోజనము జేయుట మొదటి కారణము. సాధారణ వస్త్రములను ధరించుట రెండవకారణము. సాదా భోజనమును జేయుట మూడవ కారణము. సాధారణమైన నాసనమునందు బండుకొనుట నాలుగవ కారణము. మీ రేకాంతమునందుండుట యైదవకారణము."

"ఉదాయీ! ఈగుణములవలన నేమానవుడు మహాత్ముడు

కాజాలరు. దాంభికు లీవిషయములందెంకను ముందడుగు వేయగలరు. నాకంటెను మిక్కిలి యల్పాహారమును దీసికొను శిష్యు లెందరో నాకు గలరు. నా కంటెను జినిగిన వస్త్రములనే ధరింతురు. ఎంతో రూక్ష శుష్క భోజనమునే జేయుదురు. తరుతల వాసము జేయుదు, భూశయనము గావించుచుందురు. గుహాలలో నొంటరిగనే బడియుందురు. సంప్రదింపులకుమాత్రమే విహారమున కరుదెంచుచుందురు. ఈ విషయము లన్నిటియందు శిష్యులే నన్నుమించియున్నారు. అందువలన నీవు చెప్పిన యైదుకారణముల ననుసరించి వారు నన్నెందుకుపూజించుదురు? వీటివలన నేమానవుడు పూజ్యుడు, నాదరణీయుడు కాజాలడు. ఇట్టి విషయములను జూచి ప్రజలు గౌరవించుచున్నందున బ్రపంచమున దాంభికుల సంఖ్య యధికమై, నిజమైన సేవకులు, నిజమైన సాధువులు దుర్లభమైపోయిరి. ప్రజలలో నీ యవివేకము తగ్గుకొలది ప్రపంచమునకు నిజమైన సాధువు లధికముగ లభించగలరు"

"భంతే! ఈకారణములవలన మనుష్యులు పూజ్యులు కానిచో నిక బూజ్యతనుగల కారణములెవ్వియో మీరేకారణములవలన బూజింపబడుచున్నారో తెలుపుడు."

"ఉదాయీ! నాశిష్యులు నన్ను బూజించుటకు గారణములు వేఱుగనున్నవి."

(1) నేను శీలవంతుడను. అనగా సంయమముగలవాడను. మనోవృత్తులను జయించినవాడను. విశ్వహితానుకూలముగ బనులను జేయుచుందును, విశ్వహితమునకు నాశన

మెప్పాటను గలిగించను. ఇదియే మొదటికారణము."

(2) "నేను చెప్పునదంతయు స్వానుభవపూర్వకము గనే జెప్పుచుందును. అనుభవమునకు రానివి, వీరు, వారు చెప్పినవి విని, నేనెప్పుడు బోధించను. ఇది రెండవకారణము."

(3) "ప్రతి విషయమునొక్క పరిణామావస్థను, భవిష్యత్తులో దాని ఫలితములను గుఱించి యెక్కువగ నాలోచించుచుందును. అందువలన నాసిద్ధాంతములు సర్వకాలములందు మాన్యములై యితరుల ఖండనకు గురికాకుండుట మూడవ కారణము."

(4) "వ్యర్థముగ జ్ఞానభారమును నేను శిష్యుల కంటగట్టలేదు. దుఃఖస్వరూపమును, దానికి కారణమును, దుఃఖనాశనమును, దుఃఖనాశనమునకు మార్గమును (ఆర్య సత్యములు) బోధించి ఆదర్శము, సుఖమయమైన జీవనమును గడుపుటకు మార్గము నుపదేశించితిని. ఇది నాల్గవకారణము."

(5) "సులభమైన కార్యక్రమమును శిష్యులకు బోధించితిని. వారు సరళ మార్గమున ముందుకు బోవుచున్నారు. కొందరర్హతులగుచున్నారు. మరికొందరు సాధకులగుచున్నారు. ఇది యైదవకారణము."

"ఉదాయీ! ఈయైదు కారణములవలన నేను పూజ్యుడనని నాశిష్యులు భావించుచున్నారు. పూజ్యతకు భోజనాదులు కారణములుకావు. శీలవంతుడు భోజనమును లెక్కించడు. అతడు విలాసికాడు. విలాసములనిన భయపడి దూరముగ

బసు గ్రత్తియనుబోడు. అతడుసమభావముగలవాడై శాల్యోదన ములభించినను లేక శాకములులభించినను, రెంటియందును సం తోషభావమునే బ్రకటించును. అతనికి బ్రదర్శనాభిలాష యుండదు. అందువలన బ్రదర్శనములను నేను లెక్కించను. ఈకారణముల వలన నన్ను బూజ్యుడని నాశిష్యులు తలంచు చున్నారు." ఉదాయి నాయూదర్శములను సమర్థించెను.

## 22. ధర్మముపేరుతో హత్య.

వివేకహీనుని హస్తగతమైన ధర్మమేదియు సురక్షిత ముగ నుండజాలదు. ఉత్తమోత్తమ విషయముగూడ వివేక హీనునిచేతిలో దురుపయోగముగ మారిపోవును. జీవితము నకు బదులుగ మరణమే కన్పించును.

మొన్నటిదినమున శరీర వ్యామోహమునుండి యిం ద్రియభోగములనుండి శిష్యులను దూరముజేయుటకై యశుభ భావనల నుపదేశించితిని. శారీరక విషయభోగములందు జిక్కుకొని గర్తవ్యమును మరచిపోవుదురను శంకతో శరీరము ఘృణాస్పదమైనదని భావించితిని. ఇది నిస్సారమనియు, మాంసవస్త్రాది వికారమనియు బోధించితిని.

ఉపదేశము నిచ్చి యొక పక్షముదినము లేకాంత

వాసమునకై వెళ్ళితిని. అటనుంచి తిరిగి వచ్చిచూడగా భిక్షు వుల సంఖ్య చాల తగ్గినట్లుగ గనపడినది. కారణ మడిగి తెలిసికొని కంపించిపోతిని.

శరీరము నిస్సారమని భావించి భిక్షువులు తమ శరీరములను నాశనముజేసికొన బ్రారంభించిరి. అనేకు లాత్మహత్యలు జేసికొనిరి. మరికొంద రాత్మహత్య నొనరించుకొన లేక దమను జంపుమని నితరులను బ్రార్థించి, వారి చేతులద్వార చంప బడిరి. భిక్షుహత్య చేయుట ధర్మకార్యమని భావించి యొక భిక్షువు హత్యనే దన కర్తవ్యముగ జేసికొనినాడు. ప్రాతః కాలమే లేచి యా భిక్షువు హస్తమున కరవాలము బూని "చావదలచుకొన్న వారెవరో రండి, నేనా ధర్మకార్యమును జేయుటకు సిద్ధముగ నున్నానని" కేకలు వేయుచుండెను. తరించదలచినవారియొక్క శిరఃఖండన మతడుచేయుచుండెను. ఈ విధముగ నొక పక్షము దినములలో నతడు కొన్ని వందల భిక్షువులను హతమార్చెను. ధర్మమనుపేరుతో నీమూఢులు, నవివేకు లొనరించినంత పాపకాండను పేరుమోసిన పాపాత్ముడును చేయజాలడు.

---

## 23. రక్తము - నీళ్లు.

---

అహంకారము వలన మనుష్యున కెంతటినష్టము సంభవించునో చెప్పజాలము. అహంకారవశుడై పోట్లాడుచున్నవారు

గవర్నరుకొఱకై మనుష్యములను బోగొట్టుకొనుచున్నాననుభావము గూడ నతనికి గలుగదు. నేను శాక్యులు, కోలీలు పరస్పరము పోట్లాడుకొనుచుండిరి. నదిమీదకట్ట బడునాసకట్టనుగురించి వారికి పోట్లాటకలిగెను. ఇరుపక్షములవారు దమ తమ క్షేత్రములకు జలమును గొనిపోవలయునని దలంచుచుండిరి. దీనికొఱకై యొకరు మరియొకరి రక్తమును బ్రవహింప జేయుచుండిరి. బహుశః వారికి నీటికంటె రక్తము చౌకగాబోలు.

"నేనచటికి వెళ్ళియిట్లుజెప్పితిని. ఎవరైనా నొకకడివెడు నీళ్ళు దీసికొనివచ్చి వాటికి బదులు కడివెడు రక్తము నీయుమనిన మీరిచ్చెదరా?" నీటికి బదులుగ నేమూల్య మౌక్కరక్తబిందువునుగూడ నీయుడని వారిద్దఱు జవాబుజెప్పిరి.

"అట్లగుచో నదీనీరముకొఱకు వందలకొలది మానవుల రక్తమును మీరెందుకు బ్రవహింపజేయుచున్నారు?" రెండు పక్షములవారు సిగ్గుపడిరి. అంతటితో జగడము ముగిసినది.

---

# 24. విశ్వసేవాదృష్టి.

విశ్వసేవ చేయగలమని చెప్పుటెంత సరళమో, విశ్వసేవనొనర్చుటంత కఠినము. కుటుంబములను త్యజించి జగత్సేవకొఱకు భిక్షువులు విహారమున బ్రవేశించుదురు. విహారమునందు వారుచిన్నలోకమును సృష్టించుకొని గూర్చుందురు. వారి లఘులోకమునకు వెలుపలనెవరు వచ్చినను, నెవరు

బ్రతికినను వారు లెక్కజేయరు. నేడు నాసంఘమున వేలకొలది సాధువులున్నారు. వారికే వందలకొలది లోకములున్నవి. తమ లోకమునకు వెలుపల నేమిజరిగినను చింత లేదు. ఇదియెంతటి దారిద్ర్యము, యెంతతుచ్ఛము. వీరిట్లు సంకుచితులైనప్పుడు జగత్కల్యాణమెట్లొనర్చగలరు? వీరిసాధుత్వమసాధుత్వముగా మారి ప్రపంచమునకు భారమైపోవును.

ఆనందునితో నేను విహారమున భ్రమణ మొనర్చుచుండగ మూల్గుచు, బాధపడుచు, బడియున్న నొక భిక్షువును జూచితిని. కుక్షి రోగముతో నతడు బాధపడుచుండెను. అతనికి పరిచర్య నొనర్చుటకు నేభిక్షువును రాలేదు. అతని శరీరము మురికిగనుండెను. అతని యవస్థను జూచిన నాకు చాల దుఃఖము గలిగెను. భిక్షువులయొక్క స్వార్థ వృత్తికి రోషమును వచ్చెను. ఆనందునిద్వార నీటిని తెప్పించి నేనతనికి స్నానము చేయించి యుతికిన బట్టలు కట్టించి మంచము మీద పరుండబెట్టితిని. తదనంతరము భిక్షువుల నందఱిని సమావేశపరచి యిట్లు బోధించితిని. "ఓ భిక్షువులారా! మీకు తల్లులుగాని తండ్రులుగాని లేరు. బంధు సోదరులును లేరు. ఇక మీలో మీరొకరు మఱియొకరికి సహాయము చేయకున్న మఱెవరు చేయగలరు? కొంచె మాలోచించుడు. ప్రపంచసేవకేగదా మీరు గృహములను త్యజించినది. ఇక భిక్షువులకే సేవ జేయలేనిపక్షమున నితరుల కేమిసేవ జేయగలరు? ఇంత స్వార్థమున్నంతవఱకు మీరు సాధువులుగాని శ్రమణులుగాని కాజాలరని గుర్తుంచుకొనుడు."

# 25. కన్యా జన్మ.

నేడు నాయొద్ద కోసలదేశమునకు రాజైన ప్రసేనజిత్తు కూర్చొని యుండెను. ఉపదేశానంతరము వారి సేవకు డొకడు వచ్చి "మల్లికాదేవికి కన్య కలిగినదని" చెప్పెను. ప్రసేనజిత్తుని భార్యయే మల్లికాదేవి. కన్యాజన్మ సమాచారమును వినినంతనే ప్రసేనజిత్తుని ముఖము తెల్లబడిపోయెను. సిగ్గు వలన నతనిదృష్టి భూమిమీదనే యుండెను. అతడు ఖిన్నుడగుటను గమనించి నేనిట్లంటిని. "ఓ రాజా! కన్యాజన్మవలన నింతగ నెందులకు బాధపడుచున్నారు. స్త్రీలకంటె శ్రేష్ఠులైనవారు పురుషులలో గొందరున్నట్లుగనే పురుషులకంటెను శ్రేష్ఠులైనవారు స్త్రీలయందు గొందరు గలరని మీ రెఱుంగవలయును. సమాజమునకు స్త్రీ పురుషులిద్దరు నవసరమే. కొందరనుకొనునట్లుగ నందరి గృహములయందు పుత్రులే జన్మించినచో నొకటి రెండు తరములకు ప్రపంచమున నొక్క మానవుడుగూడ నుండడు. మానవజాతి రక్షణకు పుత్రజన్మకంటె పుత్రికా జన్మయే యధికావశ్యకమనుటలో సందేహము లేదు. పుత్రపాలనముకంటే పుత్రికాపాలన మొనర్చుటవలన బ్రపంచమునకు నెక్కుడ సేవజేయగలము. ఇంతటి మహాత్సేవావసరము లభించినందులకు మీరు ఖిన్నులు, లజ్జితులు గాగూడదు.

# 26. సుఖ పదార్థము.

ఉదయన రాజపుత్రుఁడైన బోధి రాజకుమారుఁడు తన నూతన ప్రాసాదమున నేఁడు నాకు నిమంత్రణ నిచ్చెను. భోజ నానంతర మతడిట్లడిగెను. "భంతే! సుఖమువలన సుఖము లభించదు. దుఃఖమువలన సుఖములభించునుగదా?"

"రాజకుమారా! మొదట నాకు నిట్టియభిప్రాయమే కలదు. అందులకనియే నేను సౌందర్యరాశియైన పత్నిని, రాజవైభవము మొదలైన వాటిని త్యజించితిని. అలారాకాలాంయొద్దకు వెళ్ళి నేను సాధన జేసితిని. తదనంతరము రాజపుత్రుఁడైన ఉద్రకునియొద్దకు వెళ్ళి సాధన జేసితిని. అచ్చట నాకు సుఖము లభించలేదు. అందువలన నింకను గష్టములనుభవించవలయునని నిశ్చయించుకొంటిని. చలికాలమనక, ఎండాకాలమనక ప్రాణాయామ మొనర్చి యనేక కష్టములను సహించితిని. నిరాహారుఁడుగ నుంటిని. ఒక్కొక్కప్పుడు పప్పునీరు మాత్రమే త్రాగితిని. దీనివలన నేనతికృశీభూతుడ నైతిని. లేచినచో బడిపోవుచుండెడివాడను. రోమము లన్నియు నూడనారంభించెను. శరీరము నల్లనైపోయెను. ఇంత కష్టము ననుభవించినను నాకు సుఖము లభించలేదు. వివేక హీనము, ననావశ్యకములైన కష్టములు సహించుట వలన సుఖము లభించదని స్వానుభవమున దెలిసికొంటిని. సుఖమునకు సంయమ మవసరముగాని, దుఃఖము గాదు.

కల్యాణసాధన మార్గమున దుఃఖమెదురైనచో దాని ననుభవింపవచ్చును. కాని వ్యర్థముగ దుఃఖములను గొనితెచ్చుకొని యనుభవించుట కల్యాణముగాదు"

నా మాటలనువిని, సంతోషమునుపొంది, రాజకుమారుడు నాకు నుపాసకు డయ్యెను.

ప్రజలెంత యతివాదులు! ఒకప్పుడు సుఖముకొఱకై దుఃఖము వెంట బరుగిడుచుందురు. మరొకప్పుడు సుఖముకొఱకై సుఖములనే వెదకుచుందురు. ఇంకొకప్పు డుచిత సుఖమునుగూడ పాపమని భావించుదురు. మరికొన్ని సమయములందు నవసరమైన కష్టములనుగూడ సహించనొల్లరు. వివేకము నెప్పుడును నుపయోగింపదలచుట లేదు. వివేకహీనములైన దుఃఖములద్వార సుఖము లభించునెడ సర్వ పశుపక్ష్యాదులు సుఖులైయుండవలెనుగదా! నేడిదియే జరుగుచున్నది. సుఖముకొఱకు ప్రజలు దుఃఖము ననుభవించదలచుచున్నారు. అందువలననే యనేకులు సాధువేషములను ధరించి యనవసర దుఃఖముల ననుభవించుచున్నారు. వివేకహీనులైనందున నాంతరిక సుఖము వారికుండదు. ఇక బాహ్య సుఖమును వారు సర్వదా పాపమని భావించుదురు. ఈప్రకారముగ ధర్మమునుపేరున దుఃఖమే సర్వత్ర తాండవమాడుచున్నది. ఈ పాపమును దూరము జేయుటకొఱకే నేను మధ్యమమార్గమును (Middle way) స్థాపించితిని.



# 27. దేవదత్తుడు.

తీర్థంకరుని కష్టములను సమకాలికు లెఱుంగజాలరు. ఒక ధర్మ సంస్థను స్థాపించుటయందు, దానిని నడుపుటయందు నపరిమితానుభవము, మౌలికజ్ఞానము (Original thinking) అసీమ సంయమము, నిరాశను జయించగల శక్తి, యసాధారణ మనోవైజ్ఞానము నిష్పక్షపాతబుద్ధి, నిస్స్వార్థభావ మవసరమను విషయము చాల తక్కువమందికిమాత్రమే తెలియును. సంవత్సరములకొలది తపమొనరించినమీదట గొంత ఫలితము లభించును. ఆ మహాత్మునియొక్క ఫలితమునే యనుయాయులు జూడగలుగుదురు. కాని యా ఫలితమునకు ముందాయోగియందు దాగియున్న యోగ్యత, యనుభవము. త్యాగము మౌలిక యాలోచన మొదలైన యసాధారణ గుణములను గురించి వీరాలోచించరు. అందుచేత నా సఫలత్వము ననుకరించుటకో, లేక దాని నపహరించుటకో యనుయాయులు ప్రయత్నము జేయుచుందురు. ఈ విధముగ నీ పరాన్న భుక్కులు దొంగలై తాము పతితులగుటయేగాక దమతోపాటు వందలకొలది యనుయాయులను బతితులుగ జేయుదురు. తీర్థంకరులో లేక గురువులో కావలయునని వారి తలంపు. కాని వారికున్న స్వల్పమైన సాధుత్వమునుగూడ గోల్పోయి సాధుసంస్థనుగూడ ఛిన్నాభిన్నము జేసివేయుదురు.

సాధు సంస్థలో బ్రవేశించి తన స్వల్ప సాధుత్వమును

బోగొట్టుకొనిన్న్వ, పర కల్యాణమునకై ప్రయత్నించక నహంకారమును బూజించు మానవుడు ప్రపంచములో భయంకరాతిభయంకర ప్రాణిగ దయారగును. అట్టి భయంకర ప్రాణులలో జేరినవాడే దేవదత్తుడు. నామ మోహ కారణముగ నతడు పూర్తిగ పతితుడైనవిషయము నాకు దెలియును. నాకు దెలియునను విషయము నతడు తెలిసికొనెను. నామ మోహాంధత్వమువలన నతని బుద్ధి భ్రష్టమైపోయినది. సాధారణమైన వ్యవహార జ్ఞానముగూడ నతనికి లేదు. అడుగవలసిన వస్తువేదో, యడుగరాని వస్తువేదో యతనికి దెలియదు. యాచించినను లభించని వస్తువులు కొన్ని గలవు. నిజమైన యశస్సు, ఆదరము, పూజ్యత మొదలైన వస్తువు లీకోటికి జెందినవే.

నాతో సమానమైన యాదరము, పూజ్యత, తనకు లభించవలెనని దేవదత్తుడు రాత్రింబగళ్ళు స్వప్నమును గనుచున్నాడు. కాని ప్రపంచమునకు నేనేమిచ్చితినో, నేనెంత త్యాగము జేసితినో వాటిని గురించి యతడాలోచించుట లేదు. ఒక కుపుత్రుడు తండ్రి యాదాయము నపహరించినట్లుగ దేవదత్తుడు నా యాదరమును, నా గురుత్వమును లాగుకొన బ్రయత్నించుచున్నాడు. "భంతే! తమరు వృద్ధులైతిరి. ఇక విశ్రాంతి దీసికొనుడు. ఇక భిక్షుసంఘ సంచాలకత్వమును నా కప్పగించు"డని మొన్నటిదిన మతడు నన్నడిగెను.

"సోదరా! సంఘ సంచాలనమునకు నెవడర్హుడో"యని

యాలోచించవలసిన బాధ్యత నాకున్నది. సంఘసంచాలకుడు కాగోరువాని యందు కనీసము తన నోటిద్వార యా పదవి గావలయునని యడుగని గంభీరతయైనను నుండవలయును.

నామాటవిని దేవదత్తుడు క్రుద్ధుడై సిగ్గుచే హాసము వహించెను. హాసానంతరము, "భంతే! భిక్షుసంఘమును గురించి నా కెంతయో శ్రద్ధ కలదు. ఒక్కొక్క భిక్షువును గురించియు నే నెక్కువధ్యానముతో నాలోచించుచున్నాను. కాని మీరు నా భావమును గుర్తించుటలే"దని యతడు జవాబు జెప్పెను.

"నీవిషయమును గురించి యతి జాగ్రత్తగ పరిశీలించు చుంటిని. కాన సంఘ భారమును నీకు సమర్పించ బూను కొనలేదు. విహారమునం దేభిక్షువు నా ప్రేమపాత్రుడు గాకుండునట్లు, యోగ్యుడైన భిక్షు వెవడో, శ్రద్ధాసంపన్నుడైన భిక్షు వెవడో నాకు దెలియకుండ జేయుటయే నీ ముఖ్య కర్తవ్య ముగ నున్నది.

బుద్ధమహాత్ముడు తన హృదయమందుగల యాశయముల నన్నిటిని దెలిసికొనెనని సిగ్గుజెంది, నిరాశయుడై చింతించి, కోపము దెచ్చుకొని, నాకు శత్రువై వెళ్ళిపోయెను.

అతడు వెళ్ళి యజాతశత్రువును గలిసికొని, నాహత్యకు బ్రియత్నించెను. చివరకు కొండ కొననుండి రాతిగుండును నేనున్నవైపు దొర్లించెను. ఆ గుండు నాకు దగులలేదుగాని,

అది మరియొక శిలకు దగిలి, దాని ముక్క నాకు దగులగా, నా కాలునుండి రక్తము ప్రవహించెను. నామమోహము వలన మానవు డెంత నీచుడగునో — దీని కుదాహరణము దేవదత్తుడే.

---

## 28. మహాపరినిర్వాణము.

సారిపుత్ర, మౌద్గల్యాయనులు లేనందున భిక్షుసంఘము శూన్యమైనట్లు కనబడుచున్నది. నాశరీరము నాశోన్ముఖమగుచున్నది. నేడో, రేపో నేనును సెలవు దీసికొందును.

ఆనందుని పిలిపించి, భిక్షువు లందరిని సమావేశపఱచి, వారికిట్లు సందేశము నిచ్చితిని. "ఓభిక్షువులారా! నా నిర్వాణానంతరము, ఇంతవరకు నేను చేయుచున్న పనిని నాధర్మము, నేను బోధించిన వినయ నియమములు బూర్తి జేయగలవు. శిష్టాచార వినయములను స్పష్టముగ నుడివితిని. వాటిని గురించి మీకు వాదోపవాదములవసరము లేదు అవసరమైనప్పుడు చిన్న చిన్న నియమములలో సమయానుకూలముగ మార్పు జేసికొనవచ్చునని సూచించితిని. నియమములన్నియు దేశకాలముల ననుసరించియే సృష్టింపబడుచుండును. సాధారణమైన బాహ్యాచారములను, బాహ్య నియమములను

పాటించవచ్చును గాని, మనుష్యునకు, మనుష్యునకు మధ్య భేదము గలిగించునంతగ, భిక్షుసంఘమే ముఠాలు, ముఠాలుగా చీలిపోవునట్లుగ బాహ్యాచారములకు ప్రాముఖ్యము నీయరాదు.

భిక్షుసంఘమును స్థాపించి నేను మంచిపనిజేసితినో, లేక చెడుజేసితినో యని యాలోచించునప్పుడు, రెండుపక్షము లందు గొంత జెప్పుట కవకాశము గలుగుచున్నది. సంఘ స్థాపన జరుగకున్నపక్షమున బ్రపంచమున కధికహాని సంభవించి యుండెడిది. నా యుపదేశములవలన శాశ్వతలాభము గలిగియుండదు. సమాజమున, ధర్మమున గలుగ వలసిన క్రాంతికి బీజారోపణ జరిగియుండెడిదిగాదు. శతాబ్దముల వరకు బనిచేయుటకుదగు నొక నవీన క్రాంతికి, నొక నూతన సంస్కారమునకు, నొక క్రొత్త యాలోచనకు బునాది యేర్పడినది.

ఒకప్పుడీసిద్ధాంతములకును వికార దోషము పట్ట వచ్చును. కాని యంతలో గోట్లకొలది మానవులకు దరణోపాయము లభించును. సమాజము పూర్తిగ మారి పోవును. చివర కన్నియు నశించునుగదా? జీవితము నశించి పోవునట్లు, సంఘమును నశించును. సంఘ నాశనముతో పాటు తద్ధర్మముగూడ నశించును. సమాజమును చివర కదృశ్యమగును. నాశనస్వభావ మన్నిటికున్నప్పుడిక నాశన మును గురించి చింతించవలసిన పని లేదు.

సంఘస్థాపన జేయకున్న పక్షమున నాజీవన మింతకంటే

శాంతి పూర్ణముగ నుండెడిది. అయిన నేమి? కొంచెము స్వార్థమునకై సమాజమునకు జేయవలసిన మహాకల్యాణమును గురించి హానిని వహించుట మనుష్యత్వమేగాదు.

నేను మహా సంతోషముతో దనువు జాలించుచున్నాను. ఏ పరిస్థితులలోను వెళ్ళక తప్పదు. కాని కొంత పనిజేసి వెళ్ళుచున్నాను. ప్రపంచముయొక్క నైతిక స్థాయిని కొంచెము పెంచి, ప్రజలకు సుఖసామగ్రి నందించి విశ్రమించుచున్నాను. ఈ జీవితమునకు, నీ క్షుద్రదేహమున కింతకంటె మించిన యుపయోగమేమి కలదు?

సమాప్తము.



Apply to :—

1. Maruthi Book Depot, Guntur-1
2. Sri P. V. Ramana Reddy M. A.,
S. S. & N. College, Narasaraopet.
3. S. S. & N. College Co-operative Bo
Stores, Narasaraopet.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B109 |
| పుస్తకం పేరు | బుద్ధహృదయము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | C1, BC1 ,D |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | S.Lakshmi |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |